

ఫలితము

ఫొటో: బి. రంగనాథన్. (మద్రాసు)

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 47
సంచిక 50
**25.8-54**

జయ శ్రావణ బహుళ ద్వాదశి బుధవారం




నీరాజనం

**ఫొటో : ఎస్. సి. జోగారావు, (కాకినాడ)**

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నరసూవారి "రాజగురువు"లో కృష్ణకుమారి.

కాలక్షేపం— 4
మణిలేని నాగిని— 6
అక్కఱరాని చుట్టములు— 11
పెద్దప్రాణం— 12
తగ్గమేళం కొయ్యతాళం— 18
వనితాలోకం— 21
నేటి స్వయంవరాలు— 23
స్వయంసిద్ధ— 26
ప్రసంగకౌశలము— 33
పిచ్చికుక్క— 38
అన్నా-చిన్నా (సీరియల్)— 39
బుద్ధిబలం - చేతిబలం— 42
బాబు బుద్ధిమంతుడు— 44
విజ్ఞానవీధులు— 47
సినిమా— 49

# దసరా సంచిక

## గడువు తేదీ పొడిగింపు

# కథలు, గేయాలు, చిత్రాల రచనలో పోటీ

రాబోయే 'విజయదశమి' పండుగకు (1954 అక్టోబరు 6 వ తేదీ) ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. బాల బాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలు, గేయాలు, వ్యాసాలు, బొమ్మలతో పత్రిక ఆకర్షణీయంగా తయారవుతుంది.

బాల బాలికల రచనాశక్తిని, చిత్రలేఖనాశక్తిని ప్రోత్సహించడానికిగాను పోటీ పెడుతున్నాము. ఈ పోటీలో ఒక మంచి కథకు, ఒక మంచి పాటకు, ఒక మంచిబొమ్మకు బహుమతులివ్వబడుతాయి.

## రచనలు, బొమ్మలు పంపవలసిన వ్యవధి 1954 ఆగస్టు 31 వరకు

ఈ సందర్భంలో రచనలు, చిత్రాలు పంపదలిచేవారు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి.

* పదిహేనేళ్లలోపు బాల బాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనవచ్చును.
* కథలు, గేయాలు, బొమ్మలు, స్వతంత్రమైనవై ఉండాలి.
* కథలు గేయాలు కాగితానికి ఒకేప్రక్క సిరాతో స్పష్టంగా వ్రాయాలి.
* బొమ్మలు రంగులలో కాని, రంగుకాగితం మైనకాని సిరాలతో వ్రాసినవిగాని పనికిరావు. ఇండియన్ ఇంక్ తోగాని పెన్సిల్ తోగాని వ్రాసి పంపాలి.
* రచయితలు, చిత్రకారులు తమ పూర్తిపేరు (ఇంటిపేరు కూడా) వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతోపాటే వ్రాసి పంపాలి.
* స్వీకరించబడని రచనల్ని, బొమ్మల్ని తిప్పి పంపాలని కోరేవారు చాలినంత స్టాంపుకూడా చేర్చి పంపాలి.
* కవర్లమీదైనా లేక రేపర్లమీదైనా "ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక దసరా పోటీకోసం" అని స్పష్టంగా వ్రాసినవి మాత్రమే పోటీకి స్వీకరించబడతాయి.

# కాలక్షేపం

"భోగే రోగభయం, కులే చ్యుతిభయం,
విత్తే నృపాలాద్భయం,
మానే దైన్యభయం, బలే రిపుభయం,
రూపే జరాయాభయం,
శాస్త్రే వాదభయం, గుణే ఖలభయం,
కాయే కృతాంతాద్భయం,
సర్వంవస్తు భయాన్వితం భువినృణాం
వైరాగ్యమేవా భయమ్."

తా॥ భోగము లనుభవించునప్పుడు రోగము వచ్చునని భయమున్నూ, సద్వంశములో ఉద్భవించినప్పుడు ఆ ఉన్నత స్థితి నుంచి పదచ్యుతి కలుగునేమో అప్రతిష్ఠ పాలగుదునేమో యను భయమున్నూ, ధనము ఉన్నప్పుడు దానిని రాజు తీసికొనునేమో యనెడి రాజభయమున్నూ, అభిమానంతో బ్రతికెడివానికి తాను దైన్యమనుభవించవలసివచ్చునేమో అనెడి భయమున్నూ, బలవంతుడైనవానికి శత్రువులవలన భయమున్నూ, రూపవంతుడైనవానికి ముసలితనము వచ్చి తన అందము పోవునేమో అను భయమున్నూ, శాస్త్రవేత్తయైనవానికి శాస్త్రచర్చలయందు తన సిద్ధాంతమును ఖండించు తార్కికులవలన భయమున్నూ, సద్గుణములు కలవానికి దుర్జనులవలన భయమున్నూ, శరీరమును మోచుకొనునప్పుడు మరణము వచ్చునేమో యను భయమున్నూ కలుగుచున్నవి. ఈ లోకంలోని సర్వపదార్థములకు అన్ని విధములున్నూ భయసమన్వితంగా ఉన్నవి. కాని వైరాగ్య మొక్కటే అభయం అనగా భయము లేనిది.

ఒక యిల్లాలుకు పెనిమిటిమీద ద్వేషంపుట్టి కోపం వచ్చింది. అందుమూలంగా సంసారమంటే అపారంగా భయం పుట్టింది. అనురక్తిపోయి అమితమైన విరక్తి ఏర్పడింది. అనురాగంపోయి విరాగం ఏర్పడింది. ఈ వైరాగ్యభావం అతిశయించి సంసార బాధ్యతల నతిక్రమించి నూతిలో దూకవలెనని నడికట్టు నడుము బిగించి "బుద్ధం శరణం గచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి!" అన్నట్లుగా "కూపం శరణం గచ్ఛామి!" అని భయమువీడి బయలుదేరింది. ఒక పాడు బావికి తన జీవితం అర్పించితే, తన జీవితమున కిక భావిలేదని నిశ్చయించింది. బావి చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసింది. గంగాభవానిని స్మరించుకొన్నది. ఇంతలో ఆ పాడుబావిలోని పెద్దకప్పలు కొన్ని పెద్ద రొదచేయడం సాగించినవి. అవి ఏవో బ్రాహ్మణ కప్పలవలె వేదమంత్రాలను ఘనజట చెప్పినట్లుగా ఉదాత్తానుదాత్త స్వరితములతో ఉచ్చస్థాయిలో ఉచ్చారణ చేయడం సాగించాయి. ఆమె వివాహకాలంలో చదువబడిన వేదమంత్రాలు ఆమెకు ఏమాత్రం అర్థమయ్యెనో, యీ మండూకముల మాండూక్యోపనిషద్వాక్యములు కూడా అంతమాత్రమే అర్థమయ్యెను. కాని, ఆ వేదమంత్రాలవల్ల ఆమెకు గృహస్థధర్మము యెడల ఎటువంటి భయభక్తులు కలిగినవో, యిప్పుడు యీ భేకానేక నినాదములవల్ల కూడా ఆమె హృదయంలో అటువంటి భయభక్తులు తిరిగి తలుక్కుమన్నవి. వెంటనే గిరుక్కుమని యింటివైపు తిరిగింది. ఆమెకు కప్పలు చెప్పిన మాటలేమిటో అప్పటికీ యిప్పటికీ విప్పి చెప్పగల గొప్ప పండితులు అవతరించలేదు. కాని, కూపస్థ మండూకములు కూడా నిర్భయంగా సమష్టికూటంగా, సమష్టి కుటుంబంగా ఆ కూపంలోనే సరసల్లాపాలు ఆడుకుంటున్నాయి. ఆ కప్పలకు చచ్చిపోవాలనే విరక్తిభావం ఎప్పుడూ లేదు. లభించినది భుజించి, నిర్భయంగా చావులేని జీవుల మన్నట్లుగా సారంలేని కూపంలోనే సంసారం చేస్తూ రకరకములుగా బెకబెక లాడుతున్నాయి.

ఆ యిల్లాలు ఆ రాత్రి ఆ పాడుబావిలో పడవలెనని ప్రయత్నించుటయున్నూ, కప్పల రొదలువిని తన తలపు చాలించి మరల పెరటితలుపు తెరచుకొని ఇంటిలోనికి ప్రవేశించుటయున్నూ ఇంతీ ఆయన ఒక కంట కనిపెట్టినాడు. మరునాడు మాటలవరుసను నాటి రాత్రి చీకటిలో చేసిన చెనటిచేష్టల తన పెనిమిటి ముందర చెప్పి యొప్పుకోనక తప్పినదికాదు. చిట్టచివరకు ఆమె బయటపెట్టిన నిజరహస్యం ఏమిటంటే, బావిలో దూకుటకు పట్టుదలతోనే వెళ్లినది కల్లగాదు గాని, కప్పల రొద వినేసరికి దూకుటకు మనసొప్పలేదని చెప్పింది.

జీవించాలనే ఆసక్తి జీవియైనవానికి సహజంగా ఉంటుంది. ప్రాణంపోతున్నా ప్రాణంమీది తీపి పోదు. అందువల్లనే గండం గడిచి గట్టెక్కితే, బలుసాకు తిని బ్రతుకవచ్చునని తలపోస్తాం. "బ్రతికియుండిన భాగ్యముల్ బడయవచ్చు, మాధవా మనరథంబు మరలనిమ్ము" అని తన మనోరథం వెల్లడించని మానవుడు మహిలో లేడు. కనుక బ్రతుకవలెననే కోరికం అతిరథులకూ, మహారథులకూ, పార్థునకూ, అతిసమర్థులకూ, అసమర్థులకూ అందరికీ అతిసహజంగా ఉంటుంది. బ్రతకడం ఎందుకయ్యా అంటే సౌఖ్యం అనుభవించడం కొరకు అని సమాధానం చెప్పవలసి ఉంది. ఆవిధంగా సమాధానం చెప్పినట్లయితే, ఒక చిక్కు వస్తుంది. సౌఖ్యం లేకపోతే బ్రతుకకూడదని సిద్ధాంతీకరించవలసి వస్తుంది. అప్పు యివ్వడం ఎందుకయ్యా అంటే వడ్డీకోసం. కనుక వడ్డీ లభించకపోయినట్లయితే, ఎవ్వరికీ అప్పు యివ్వకూడదని వాదించవలసి వస్తుంది. అంతేకాదు - వడ్డీ ఎంత ఎక్కువ లభిస్తే, అంత ఎక్కువగా అప్పు లివ్వవలెనని అసలుకు ముప్పు లేకుండా వాదించగలము. కాని ఆర్థిక శాస్త్రవేత్తలు ఆలోచించే అసలు సమస్య అసలు విషయం కాదు. వడ్డీ విషయమే దొడ్డసమస్య అంటారు. దేశంలో వడ్డీరేటు హెచ్చడం మంచిదా! తగ్గడం మంచిదా? ఇప్పుడు అమలులో ఉన్న గవర్నమెంటు వడ్డీరేటు నూటికి సాలుకు రూ 3 లు అయినట్లయితే, సదరు సర్కారు ఋణపత్రాలకు నూటికి సాలుకు రూ 4 లు గాని, రూ 5 లు గాని వడ్డీరేటు వృద్ధి కావచ్చునా? కావలెనా? నిజంగా దేశంలో పాడిపంటలుగాని, ప్రజలకూ ప్రభుత్వానికీ కావలసిన వస్తుసామగ్రులుగాని, సమృద్ధిగా ఉత్పత్తి అవుతూ ఉన్నట్లయితే, గవర్నమెంటుకు అప్పుచేయవలసిన అవసరం లేనేలేదు. అప్పు చేసినా గొప్ప వడ్డీయిచ్చి అప్పుచేయవలసిన అవసరం అంతకన్నా లేదు. యుద్ధం వచ్చినట్లయితే అనేక వస్తుసామగ్రులు యుద్ధావసరాలకు సమృద్ధిగా కావాలి. కొత్త పటాలాలు హుటాహుటి కావాలి. ఈ భృత్యులకు భత్యములివ్వాలి. జీతాలివ్వడానికి నేని

# ★ కాలక్షేపం ★

నిండా సైకం ఉండాలి. అందుకోసం గవర్నమెంటువారికి డబ్బు కక్కుర్తి ఎక్కువవుతుంది. రణంచేయడానికి ఋణం చేయాలి. ఆ ఋణానికి దారుణంగా వడ్డీ యిస్తామని ఆశ కల్పిస్తారు. ప్రజల సైకం ఆకర్షిస్తారు. కాబట్టి, వడ్డీ రేటు హెచ్చుగా యివ్వడానికిగాని, హెచ్చుగా యిస్తామని సంసిద్ధమగుటకుగాని, యుద్ధమే కారణం. ఆపత్కాలావసరంలో రూపాయలు తక్కువై ఋణపత్రాలు ఎక్కువవుతాయి. గత సంగ్రామ కాలంలో జపానువాళ్ళు బర్మాదేశాన్ని, సుమాత్రా, జావా, బోర్నియో దీవులను ఆక్రమించిన దినాలలో కరెన్సీనోట్ల కాగితాల కట్టలను, యుద్ధ ప్రచారమునకు అచ్చువేసిన నోటీసు కాగితాల కట్టలవలె జారీచేసి ఝూరీలతో బెదిరించినట్లుగా పంచియిచ్చి, ఆయా ప్రదేశాలలో ఉన్న ప్రజలకు నోట్ల వర్షం పూలవర్షంలాగున కురిపించారు. కాని, అవి వాసనలేని పూవులు-ఘాటు లేని నోటు అది. వెయ్యి రూపాయల నోట్లు యిస్తే వీశెడు కొయ్య లభించేది. ఉల్లిపాయ కంటె రూపాయ చవుక అయింది. ఇదంతా ఎందుచేత? రూపాయినోటు అనేది కూడా ఒక ప్రోనోటువంటిదే. “ఈ నోటుకాగితం తెచ్చియిచ్చినవానికి ఒక వెండి రూపాయి యివ్వగలవాడను” అని ఆ నోటు కాగితం మీద ముద్రించబడి ఉంటుంది. ప్రభుత్వ ఖజానాధిపతి సంతకంతో అది చలామణీ అవుతుంది. ఆ నోట్ల నన్నింటినీ గవర్నమెంటు బ్యాంకుకు తీసికొనివెళ్ళి వెండి రూపాయలను యివ్వవలసినదిగా అడిగితే గవర్నమెంటు యివ్వవలసిందే. కాని, మనం గవర్నమెంటును ఎప్పుడడిగితే అప్పుడు యివ్వగలగనే ధైర్యం మనకు ఉన్నప్పుడు, “వెండి రూపాయలే కావాలి” అని మొండి పట్టుదలతో మనం భీష్మించం. వారు అందుకే మనమీద మండిపడి దండధారుని వలె గ్రీష్మించరు. వారిచ్చిన నోటుకు వడ్డీ లేకపోయినా, ఖద్దీ బంగారంతో సమానంగా, కానుకు బదులు (క్యాషుకు బదులు) కాగితం గ్రహిస్తాం. కాని, కరెన్సీ నోట్లు వృద్ధి అయినకొద్దీ గవర్నమెంటు ఖజానా వృద్ధి అయినట్లుగా భావించకూడదు. ఇది ఆర్థిక శాస్త్ర రహస్యం. మనిషి లావైనకొలదీ, బల మెక్కువైనదని భావించడానికి వీలులేదు. దేశంలో ధరలు హెచ్చుతున్నాయని సంతోషించే వాళ్ళందరూ కళ్లుతెరచి సుమతీ శతకంలోని కందపద్యం చదువుకోవాలి. పెరుగుట విరుగుటకొరకే, “ధర తగ్గుట కొరకె హెచ్చు తథ్యము సుమతీ” అని ఒక్క ముక్కలో చక్కని ఆర్థిక శాస్త్రం ఆబాలగోపాలం ఆచంద్రార్కం ఆసేతుహిమాచలం అర్థమయ్యేటట్లుగా అరటిపండు ఒలిచిచేతిలో పెట్టినట్లుగా మతిలేని వాళ్లకుకూడా సుమతీశతక కర్త బోధించాడు.

ధరలు హెచ్చాలని తపస్సుచేసేవాళ్ళందరూ ఆర్థికశాస్త్ర ధురంధరులు కారు. ఆవిధంగా వాదించేవాళ్ళు ఆకాశంనుంచి ఐశ్వర్యాన్ని అవతరింపజేసెడి భగీరథులు అని మనం భ్రమిస్తున్నాం. కాని వారు సుమతీశతక కారుని మతం ప్రకారంగా భగీరథులుకారు. దేశక్షేమం తెలియని గంగా భాగీరథీసమానులు. “పెరుగుటవిరుగుటకొరకే—” అంతకన్నా కట్టె విరచినట్లుగా తలపై మొట్టినట్లుగా చెప్పిన దిట్ట యింకొకడు కన్పడడు.

పొగాకు ధర పడిపోతున్నదని చిరాకు పడడం ఎందుకు? ధూమపత్రం విలువ నిలువ సరకు పెరిగి నిలువలేక పడుచున్నదని ధూంధాం చేయవలసిన అగత్యమేమిటి? ధూమపత్రం లేకపోతే, భారతదేశం నిర్ధూమధామం అవుతుందా? మనకు పొగాకు పంటలేకపోతే, పొయ్యిలో పిల్లి లేవదా? ఇవన్నీ పొగాకు పంటకు సంబంధించిన సమస్యలు. ఇవన్నీ మామూలైన పొగాకు ప్రశ్నలేగాని, కేవలం దప్పని చొప్పదంటు ప్రశ్నలుకావు. మనం పండించే పొగాకు అంతా మనం కాల్చడం కోసంకాదు. నస్యంచేసి పీల్చడంకోసమూ కాదు. మన పొగాకును మనమే తగులబెట్టడం మంచిదికాదు. అమెరికావారికీ అన్యదేశాలవారికీ విశేషంగా రవాణా చేయడంకోసమూ, రవాణాచేసి వారి కిరాణా సరకులు (గిర్నీ సరకులు అనగా యంత్రాగారముల సరకులు) మనము తెప్పించుకొనుటకోసమూ, ఈ ఆకుతో కొంత వ్యాపార మంత్రతంత్రం సాగించాలి. కనుక, మన మీ పొగాకుపంట విషయములో నరాకుసేయుట పాడి కాదని పాట పాడుచున్న ప్రముఖుల మాట నిరాకరించలేము. ఇదివరకు యీ పొగాకును దొరల కంపెనీలవారు విశేషంగా కొంటూ ఉండేవారు. ఆ దొరలకంపెనీలవారు తమకు కావలసిన పొగాకురకం ఎటువంటిదో వారే నిర్ణయించి, విత్తనం వారే యిచ్చి, పండిన పంటకు విత్తంకూడా వారే యిచ్చి, పంట యావత్తు మొత్తంగా వారే కొనడం సంభవించింది. చక్కగా ఎదిగిన పొగాకు మన కోటలలో కళకళలాడుతూ ఉండేది, పెళ్లికెదిగిన పిల్లలాగున ఉండేది. దానిని చేకొనే వారు ఎవరు? అని తగిన వ్యాపారసంబంధం కోసం వెతకికొనవలసిన పనిలేకుండా దొరల కంపెనీలవారే వచ్చి మన పొగాకుచిగురాకు బోడిని చేబట్టి సరసమైన ధర యిచ్చి కరగ్రహణం చేసేవారు. అందుకని ఆ పొగాకును పైరు చేసినప్పుడే దానికి “దొర పొగాకు” అని పేరు పెట్టి దొరలకే దానిని అంకితంచేసి, వారికే ముడుపు కట్టిఉంచడం వల్ల, సంబంధం వెతుక్కోనక్కర లేకుండా మేనరికం చేసుకొన్నట్లుగా, సపిండ వివాహమైనా, సగోత్రీయంగా, అగ్నిసాక్షిగా, దొరల కంపెనీలకు తమ పొగాకునిచ్చి “కన్యాదానము చేసి మేము కడు ధన్యులమైతిమిగా” అని సంతోషించి గుంటూరుజిల్లా పొగాకు పంటదార్లు సరదార్లు అయి, సరదాగా కాలక్షేపం చేస్తున్నారు. కాని, యీ వ్యాపార సంబంధాలు తెగిపోయి, దొరలతో వ్యాపార బంధుత్వం సడలి విడిపడిపోతోంది. దొరలకు మన పొగాకుపై మక్కువ దొరలిపోతోంది. “దొరాయని నిను బిరాన పిలిచితె మొరాలింపవేరా?” అని దొరల వెంటబడినా, కొనేదొరలు మన కంటబడుటలేదు. అందువల్ల మన పొగాకును జావా, సుమాత్రా దీవులకైనా రవాణా చేసికోవాలి. సుమాత్రా దీవిలోనైనా మన పొగాకు కొనే సుమిత్రులు ఉన్నారేమో చూచుకొనక తప్పదు. కమ్యూనిస్టు చైనాలోనైనా మన కమ్మని పొగాకును (*Wel come*) వెల్ కమ్మని రమ్మని ఆహ్వానించి అభిమానిస్తారేమో అడిగి చూడాలి. ఏవిధంగానైనా యీ పంటకు తగిన జంట చూడాలి.

మన దేశావసరానికి తగిన పంటను పండించడం కాకుండా అన్యదేశాలకు రవాణా చేయడంకోసం పండించే పంటగా ఉంది ఇది - ఇది కేవలం కన్యాశుల్కం తీసికొని ఇంకొకరికి అమ్ముకోవలసిన ఆడపిల్లవలె ఉంది. ఈవిధంగా పండింపబడే పంటలను కేవలము అన్యదేశాలకు రవాణా చేసే నిమిత్తమైన పంటలని ఎంచి పెంచుతున్నాము. ఇవన్నీ దేశంలో దేశావసరానికి మాత్రమే వినియోగపడు నిమిత్తమైన పంటలు కావు. అత్తవారింటికి పోయే ఆడపిల్లలవంటివి. వ్యాపార సంబంధాల సరళిలో ఇదంతా స్త్రీ సంతానంగాని పురుష సంతానం కాదు.

అన్యదేశాలకు మన రవాణా వ్యాపారం వృద్ధి అయితేనే గాని మనం వృద్ధిలోకి రాము అనే సిద్ధాంతం కూడా మనకు అన్యదేశాలనుంచి ఎక్కువగా దిగుమతియైన వ్యాపార సిద్ధాంతం. మంచి ధర వస్తే మన ఆకు మనమే అమ్ముకొనుటకు అభ్యంతరము

లేదనే ఆత్మవిక్రయ రవాణాలకు సిద్ధపడిన దివానాల సమోనాలు కూడా తయారైనాయి. అధికారపదవు లిస్తామంటే అన్యమత స్వీకారం చేశారు. మన ప్రత్తిని మాన్‌చెస్టరుకు రవాణా చేసి, మాన్‌చెస్టరు మిల్లు తానులను కొల్లలుగా మనం తెప్పించుకొని, సీమదొరలిచ్చిన వస్త్రాలతో దుస్తులతో ముస్తాబై వారు ఏ వేషం వేయమంటే ఆ వేషం వేశారు మనవాళ్లు పెక్కుమంది. మహాత్ముడు వచ్చి "మాకొద్దు యీ తెల్ల దొరతనము" అనే పాట పాడించేవరకూ మన రంగూ, మన రాగం, మారలేదు. దొరలమీద మనకు వైరాగ్యం కలుగలేదు. "శ్రీమన్ మహారాజ్ఞీ పుంగవ!" అని చిందులుతొక్కి దొరలిచ్చిన బిరుదులే మహాప్రసాదమని స్వీకరించాం. కాని యిప్పుడు మన స్వతంత్ర ప్రభుత్వాధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ గారిచ్చినదే మహాప్రసాదమని స్వీకరించగల స్థితిలోకి వచ్చాము. రాధాకృష్ణ పండితునకు బ్రిటిష్‌వారిచ్చిన "సర్" సర్ వేపల్లివారికొక ఎక్కువైన బిరుదుకాదు. ఈనాడు రాజేంద్రప్రసాదుగారిచ్చిన "భారత రత్న"తో భారతదేశం రత్నగర్భ యనిపించుకొన్నది. తెనుగు సీమలో పద్మశాలి సంఘంలో జన్మించిన శ్రీమాచాని సోమప్పగారు కర్నూలు జిల్లాలోని యమ్మిగనూరులో చేనేత పరిశ్రమాభివృద్ధికి ఋషివలె కృషి చేశారు. అఖిలభారత చేనేత పరిశ్రమమండలిలో వీరొక సభ్యులు. ఈ పద్మశాలి ప్రముఖునకిచ్చిన "పద్మవిభూషణ్" బిరుదుపత్రము భారతీయ హృదయకాసారంలో పుట్టిన శతపత్రము వంటిది. గుట్టల కొలది బట్టలు ఉత్పత్తి చేసిన మిల్లుల కంటె చేమగ్గ మెక్కువైనదని ఉగ్గడించబడినమే చాలు. చేనేత పునీతమైనదని భారత ప్రభుత్వ నేత భావించబడినమే చాలు. అది మన భావికి మేలు.

అన్యదేశాల మెప్పులు మనకు గొప్పలు కావు. అన్యరాజ్యాలకు మనము భయపడినప్పుడే మనకు వారి అభయం కావాలి. పరాశ్రయమే భయకారణం. ఇతరుల మెప్పుకోసం ప్రాకులాడే స్థితికంటె దుస్థితి ఇంకొకటి లేదన్నారు మహాభక్తులు, దేశభక్తులు. ఆత్మవిముక్తి అంటే ఆత్మవంచన కాదు. లోకం మెచ్చుకొనకపోతే తన మనస్సుకు ముల్లు గుచ్చుకొన్నట్లుగా ఉండకూడదు. తన ఆత్మను భగవదార్పణం చేసినతర్వాత తన శరీరం ఏమవుతుందో అనే భయం కూడా ఉండదు. "మీరు పోయినతర్వాత యీ రాట్నాలు తిరుగుతాయా? యీ సేవాగ్రామ ఆశ్రమం సాగుతుందా? యీ అహింసా తత్వానికి స్థిరత్వం ఉంటుందా?" అని గాంధి మహాత్ముణ్ని ఒక పాశ్చాత్యప్రముఖుడు ముఖాముఖి ప్రశ్నించాడు. "ఈ ఉద్యమంలో సత్యం ఉన్నదని నా విశ్వాసం. భగవంతుడు సత్యస్వరూపుడని నా విశ్వాసం. కనుక నా ఉద్యమం కాదిది. ఇది భగవంతుని ప్రేరణ. భగవంతుని ఉద్యమం. కనుక నాకు పూర్వమే పుట్టిన సత్యాగ్రహం నా అనంతరం ఏమవుతుందనే చింత నాకు రవ్వంత లేదు. అభయం నాకు లేదు. సత్యమేవజయతే" అని మహాత్ముడు చిన్న నవ్వుతో ఆ పెద్ద సందేహానికి సమాధానం చెప్పివేశాడు. పలికించెడివాడు రామభద్రుండట అనే పోతరాజుకు రాజుభయం లేదు; దైన్యభయం లేదు. అప్ప కవివంటి గొప్పకవులు తన భాగవతాన్ని కవిత్వ ప్రయోగ ప్రమాణ గ్రంథంగా పరిగణించరేమో అనే భయం లేదు వైరాగ్యం అంటే అది. సంసార ప్రపంచం చూచి భయపడి, పాడు ప్రపానికి పరుగెత్తడం వైరాగ్యం కాదు. పాడు నూతిలోని కప్పలను చూచి వెరచి మరలి అడుగులు తడబడ తిరిగిపోయెడి చిగురుబోడిది వైరాగ్యము కాదు. "సర్వం వస్తు భయాన్వితం" అనే తత్వం వైరాగ్యం కాదు. సత్యమేవజయతే అనే తత్వమే అసలైన సిసలైన వైరాగ్యం. లోకులవల్ల వడ్డీ లభించదనే భయం లేని అసలు వైరాగ్యం ఇది. అట్టి వైరాగ్యం ప్రసూతి వైరాగ్యం వంటిది కాదు. స్మశాన వైరాగ్యం వంటిది కాదు. ఆత్మబలం ఇచ్చే ఆరోగ్యకరమైన వైరాగ్యమే యోగ్యమైనదన్నాడు మహాత్ముడు. ఆయన ముక్కుమూసికొని కొండ గుహలలో కూర్చుండలేదు. ఐహిక ప్రాపంచిక ఆర్థిక రాజకీయ వ్యవహారములలో సోదర దేశీయ బృందంలో బృందావనవిహారం చేశాడు. "వైష్ణవ జనతో తేనే కహియే" అన్నాడు. అటువంటి వైరాగ్యం కలవారే వైష్ణవజనులని చెప్పబడుదురు. మహాత్మునకు తిరుమంత్రమువంటిది, గురుమంత్రమువంటిది ఆ భజన కీర్తన ప్రభావం. అటువంటి వైరాగ్యం ఉంటే కాలసర్పం అంటే భయం లీలగానైనా ఉండదు. కాళంగి మర్దనచేస్తూ తాండవమాడవచ్చు. అసలైన వైరాగ్యం ఉండి త్రికరణశుద్ధిగా "కృష్ణార్పణ మస్తు" అనే వాడు కృష్ణసర్పం అంటే భయంలేని వైష్ణవుడు.

పాముకాటు విషమునకు ప్రతిక్రియగా పాముమంత్రం వేయగలనని ప్రతిజ్ఞచేసిన ప్రముఖుడొకడు గాంధిమహాత్ముని వద్ద కొకసారి వచ్చి తన మంత్రప్రభావం పరీక్షించవలసిన దన్నాడు. గ్రామాలలో, హరిజన గూడెములలో ప్రజాసేవ చేసే తన అనుచరులకు పాము భయం లేకుండా చేయుటకు యీ పాము మంత్రప్రభావం పరీక్షించి చూడవలెనని మహాత్మునకు కోరిక కలిగింది. త్రాచుపాముచేత తనకు కాటువేయించి పాము మంత్రమును తనకు వేయవలసినదని తన చెయ్యి ముందుకు చాపి సూచించాడు. వార్ధా ఆశ్రమంలో ఉన్నవారు అందుకు సిద్ధపడలేకపోతే, మహాత్ముడు నిర్భయంగా తన శరీరాన్ని కృష్ణార్పణం అన్నట్లుగా కృష్ణసర్పానికి సమర్పిస్తానన్నాడు. అప్పుడు ఆయన చెంతనున్న అంతేవాసులు అంతసాహసం కూడదని ఆయనను అడ్డగించారు. ఆయన చుట్టూ చేరినవారికే కాదు.

"సర్వం వస్తు భయాన్వితం భువినృణాం"

ఈ లోకంలోని సర్వసామాన్య మానవులకు సర్వవస్తువులు భయాన్వితంగానే ఉంటాయి.

"వైరాగ్య మేవాభయం"

వైరాగ్యం మాత్రమే భయము లేనిది. ★

# మణిలేని నాగిని

రమణశ్రీ

మగపెళ్లివారి విడిది కిలకిలలాడుతూ సందడిగావుంది. బ్యాండూ సన్నాయిలతోపాటు ఆడవాళ్ల అరుపులు హడావుడీ, అలజడీ పెళ్ళికొడుకు రాజారావు చెవిని గగ్గోలెత్తిస్తోంది. ఓ ట్రంకుమీద నిశ్చలంగా కూచుని వాచీ చూసుకొంటున్నాడు. జరజరలాడుతూ సెకండుముల్లు నిముషాల్ని తిప్పుతోంది!

మధ్యాహ్నమనగా భోజనాలవీ చేసి బల్లెక్కవచ్చారేమో...నిమిషాలమీద ఆడపెళ్లివారు పంపించిన ఫలహారాల పళ్లాలు ఖాళీ చేసేస్తున్నారు. తియ్యబూంది, పకోడీ, కాఫీ—వీటితో ఎవరి హడావుడి వాళ్ళదే!...రాజారావు కీదృశ్యం కళ్ళనిండా సంతృప్తి నిండారించింది. అంతకీ తనే మూలకారణమైనట్టు ఓ చిరునవ్వు నవ్వుకొన్నాడు. జేబిలో చెయి పెట్టేసరికి సిగరెట్టు పెట్టె చేతికి తగిలింది. బయటికి తీసి వెలిగించాడు. ఈ రెండురోజులూ ఘరానాకైనా స్టేట్ ఎక్స్‌ప్రెస్ వెలిగించక పోతే ఎలా? దర్జాగా బయటికితీసి... మబ్బులు దుబ్బులుగా పొగవదుల్తూంటే చూసేవాళ్ల కళ్లని వెనకనించి ఎవరో చూస్తూవుండాలి! కాళ్లకి నిండుగా కొత్తగా కొన్న బూటు టకటకలాడుతోంది. ముఖాన కళ్యాణతిలకం, కళ్ళకి నల్లని కాటుక—ఇంకేం కావాలి? జీవితంలో సుఖఘడియలు గడియలు తీసుకొని సౌందర్యమూర్తులైన లలనామణుల్లా తొంగిచూస్తుంటే ఇంకేం కావాలి?

ఆలోచనలు ఎఱ్ఱగా పచ్చగా గుండెల్ని పొరలు పొరలు చుడుతూ రాజారావుని వాతావరణంలో ముంచుతూ తేలుస్తూంటే, పెదవులమీద సిగరెట్టు ఉంగలు ఉంగలుగా మేఘాల్ని సృష్టిస్తోంది! ట్రంకుల్లోంచి బట్టలూ, అద్దం దువ్వెనలూ తీసుకుని ఆడవాళ్లు చాపలనిండా బాతాఖానీలు, జడలూ, పువ్వులూ ... ఎవరిష్టం వచ్చినట్టు వాళ్లున్నారు!

'ఒక్కసారి లేస్తారా?' కంచు గంట కొట్టినట్టు వినిపించింది. పలుకుబడిలో సౌమ్యం, కంఠంలో మాధుర్యం రాజారావుని చిటికెలో లేవదీశాయి. కళ్లు విప్పి చూశాడు ఎదుటి వ్యక్తివైపు! పెదవిమీది చురుకైన చిరునవ్వు ఇంకా జారిపడలేదు! ఆ ముఖంలో నిరంతరం నిలబడి సాగిస్తోన్న చురుకుదనం - సౌందర్య తరంగం - మనసుల్ని దహించే అపూర్వమైన యౌవన జ్వాల - ఆ అమ్మాయిలో సుఖంగా ముద్ర వేసుకొనివుంది.

బట్టలు తీసుకొందామని' - అంది మళ్ళీ మాటలు కలుపుకొంటూ.

నిశ్శబ్దం!...

'మీ రింకా ఫలహారం చేయలేదనుకొంటాను'

తిరిగిఅంది అతనివైఖరి కనిపెట్టి. తనతో అంతగా మాట్లాడాలని ఉత్సహించే ఆ అమ్మాయెవరో తనకేం తెలుసు? ఎందుకో చూచినవెనువెంటనే, మనసుని జివ్వున లాగుతోంది ఏ అపూర్వ శక్తితోనో?...

'ఊహుఁ నాకెవ్వరూ ఏం తెచ్చిపెట్టలేదు'

ఆ అమ్మాయి విరగబడి నవ్వింది.

'భలే పెళ్లికొడుకులే! ఈ హడావుడంతా మీదికాదూ? పళ్లాలమీద విరగబడి తినాల్సిందిపోయి...'

ట్రంకు తెరిచి, కావలసిన వోణి, రవిక, తీసుకొని, 'ఉండండి! నే తెచ్చి పెడతాను' అని వెళ్లిపోయింది.

అలా నిర్భయంగా స్నేహపేయంగా మాట్లాడేదెవరీ అమ్మాయి? పూర్వ పరిచయమున్నట్టు తెగేసి మాట్లాడుతోంది. రాజారావు కింకా ఆ అమ్మాయిలోనే మాట్లాడుతోన్నట్టుంది! వెళ్లిపోతోంటే చూశాడు సన్నని వన్నెలజారీ మెడవొంచి, జడ గుండ్రంగా తిప్పుకొంటూ.

పదేపదే వినిపిస్తూ గంటలు కొడుతున్నట్టున్నాయి అవే మాటలు ... ఆ అమ్మాయి మీదికే తనమనసెందుకు పాదరసంలా పాకుతోంది? ఏం లేకండానే హృదయమిచ్చి పలకరించింది, తెల్లవారితే తనకి పెళ్ళి కాబోతున్నది...ఎందుకీ ఆలోచన? అది డెవరైతే తనకేం? ... ఆ అమ్మాయే తన భార్యయితే...! అపిల్ల మెడలోనే మంగళసూత్రం కట్టేస్తే ... ? తతంగమంతా తలకిందులైపోతుంది!

రాజారావు దిగమింగుతూ ఆ అమ్మాయి మీద పాదిగే ఊహాల్ని నమ్మకండా తోసిపారేశాడు. మరోసిగరెట్టుతీసి వెలిగించాడు.

'ఆగండి! ఈ కాస్త ఫలహారం...' అంటూ తియ్యబూందీ రాజారావుదగ్గర పెట్టింది ఇందాకటమ్మాయి. 'ఫలహారాల పెత్తనం నాదేలెండి! అమ్మగారు నాకే అప్పజెప్పారు' అంది ముసిముసినవ్వుతూ...

అతను తింటూన్నంతసేపూ సిగ్గుపడకుండా అక్కడే నుంచునివుంది. ఏవో మాట్లాడుతోంది పెళ్ళివిషయాలమీద. 8 గం|| లకిగాని భోజనాలు కావట! తెల్లవారులూ నిద్రలుండవట! తన తలమీద పెద్ద భారమే మోపారట!

రాజారావు హృదయానికి అమృతస్పర్శ తగులుతోంది! ఏవిటో అపూర్వమైన అవినాభావసంబంధం...? రాజారావు ఊహలు ఆనందబంధాలు వేసుకుని స్నేహ ప్రణయ రసాలతో తొణికిసలాడుతున్నాయి.

డాబాపై కెక్కాడు. చల్లనిగాలి ... ఆకాశతీరాలకి అలసిసొలసి చేరుకుంటూన్న



బొంబాయి మ్యూజియమ్
(ఫొటో:) పి. సి. యం. ఈశ్వరబాబు

మబ్బులు ... విశీర్ణ పీతాంగవస్త్రాలతో రక రకాల అభినయాల్ని తోపించే, విశాల హృదయంలా ఆకాశం ... చుట్టుపక్కల కిందికి చూశాడు. ఎవరో ఆడవాళ్లు స్నానం చేసేందుకు సిద్ధమౌతున్నారు. రాజారావు దర్శించే ప్రకృతి నించి కళ్ళని మళ్లించి పక్కకి తప్పుకొన్నాడు. సిగరెట్టు తీసి వెలిగించబోయాడు అగ్గిపుల్ల రాలి ఆరిపోయింది నిరాశతో, సిగరెట్టు వెనక్కి మడిచేశాడు ఎవరో మ్రాళ్లు డాబాపై కెక్కుతోంటే, దబుకు దబుకుమంటోంది. ఆ శబ్దాన్ని గుండెలు కూడా అనుకరించి కలవరించాయి తలలో ఆలోచనలు మళ్ళీ సుడితిరగడం ఆరంభించాయి ఈ పెళ్లి ఎందుకు జరుగుతున్నట్టు? వద్దువద్దని మూర్ఖపు పట్టుపట్టి చివరికి ఓడిపోయాడు. అంతా కట్నంకోసం! తన ఆశయాల్నీ ఆశల్నీ నెరవేర్చలేని డబ్బుకోసం తల్లితండ్రులచేత బతిమాలించుకుని ఏదో, ఒప్పుకొన్నాడు చివరికి ముహూర్త నిర్ణయమై, కొన్ని ఘడియల్లో ఆ శుభకార్యం జరగబోతోంది

కనుచీకటి పడింది. దీపాలన్నీ చీకటి బతుకులో ఆశాకళికల్లా వెలిగాయి ఎవరో నలుగురైదుగురు పెద్దలూ, రాజారావు బావమరదులూ .....పైకొచ్చారు తన్ని చూడ్డానికి; పెళ్లి సువాసనంతా వాళ్లఒంటి మీంచి వ్యాపిస్తోంది.

రాజారావు మెట్లమీంచి కిందికి చూశాడు. ఇందాకట్నుంచీ మనసులో అచ్చుపడుతోన్న ఆ అమ్మాయి కుళాయిదగ్గర ముఖం కడుక్కుంటోంది. సబ్బు నురగ మొహం నిండా చిక్కని వెన్నెల పాకినట్టు పాకింది

నిమిషంలో అతని ముఖంకేసి చూసైనా చూడకుండా లోపలికి పారిపోయింది.

'ఆ అమ్మాయెవరండీ? ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం' అన్నాడు బావమరది...

అతన్ని కూడా ఆకర్షించే శక్తి ఆ అమ్మాయిలో వుందన్నమాట! 'ఏమో నాకు తెలీదు', అన్నాడు రాజారావు ముభావంగా

'వెళ్లొస్తాం' అంటూ దిగిపోయారు వాళ్లు దిగిపోవడమే తనకి కావలసినట్టు నిట్టూర్పు విడిచాడు. అతని ఊహాపోహాలన్నీ చిత్రంగా మెరుస్తున్నాయి నరాలు కొత్తగా సంగీతం పాడుతున్నాయి. రక్తం

 

# మణిలేని నాగిని



అలరెత్తుతూ ప్రణయ కవితాగానం చేస్తున్నాయి.

మేడమెట్లమీద అడుగుల చప్పుడు... పెదవుల మధ్య సిగరెట్టు...చిత్రంగావున్న సన్నివేశం...ఏకాంతం...

చప్పుడు...ఇంటాక టమ్మాయే!

'మీరా! ఎవరూ లేరనుకొన్నా. హాయిగా ఊపిరి పీల్చుకొందామని వచ్చా' అంది రోడ్డుమీదికి చూస్తూ...

సిగరెట్టు అవతలికి పారేసి గుండెల్లో కలవరాన్ని దిగమింగుతూ...తనవెంట నీడలాగే...ఎందుకో!

కళ్ళు తిప్పి, 'అన్నట్టు పెళ్ళికూతుర్ని చూశాను' అని నవ్వింది. సాధారణంగా అలా అన్నపుడు వేయవలసిన ప్రశ్న 'ఎలావుంది?' అని.

రాజారావు అసహ్యంగా, 'ఏడిసినట్టుంటుంది' అన్నాడు.

'అవిడ కేమండీ! ఫర్వాలేదు' అంది. కిలకిల నవ్వుతూ ముఖంలోకి చూసింది. అతని ముఖం పాలిపోయివుంది. తన ముఖంలోకి అతను చూశాడు. ఉన్నమాటంది. ఎలాంటి పొగడ్తా, పక్షపాతం లేదు. నిశ్చలంగావుంది ఉషస్సులా.

ఆ ప్రసంగానికి తుదముట్టిస్తూ, 'అంతా మీలా వుండగలరా? ఎవరి అదృష్టం వాళ్లది. అంతా మీలా అందంగా వుంటారా?' అన్నాడు. ఆమాటల్లో ఈర్ష్య, అమర్ష ఏవో గుణాలున్నాయి. నిరసనభావం కొట్టొచ్చినట్టుంది. అవిడ నవ్వుతూ, 'ఇంతకీ అమ్మాయి అదృష్టవంతురాలు! దేనికైనా పెట్టిపుట్టాలి' అంది జీవితంలో గాయపడ్డదానిలా...

'ఇంతకీ మీపేరు నాకు తెలిసిందికాదు'

ఒక్క నిమిషం గడిచాక, 'పేరులో ఏవుంది లెండి! నాగమణి..కీరవాణీ, మంజుభాషిణీ మాత్రం కాదు...లెండి!' అంటూ గొంతు గలగల లాడించింది.

'ఇలావుంటే ఎవరేనా చూస్తే ఏమనుకొంటారు? నేను కిందికి వెడతాను...'

'పెళ్లికూతురిపేరు విన్నారా?' అన్నాడు రాజారావు.

'ఆc! పేరమ్మపేరు పెట్టారట చిన్నప్పుడు..పెళ్ళికొడుకులికి మరీ అసహ్యంగా విన్పిస్తోందని, పేరిందేవి అని మార్చేశారట' అంది వెటకారంగా నవ్వుతూ.

నవ్వుల ఘులంఘులలు, పెదవి వంపులు, వయ్యారాలూ, స్నేహమయ దృక్కులూ విగిల్చి, రాజారావు చుట్టూ శూన్యాన్ని విర్పరచి, మెట్లనిండా నవ్వులు దొర్లించుకొంటూ దిగిపోయింది!

పెళ్లికూతురు...పేరమ్మ...కాదు కాదు పేరిందేవి...ఎంత అసహ్యంగా వినిపిస్తోంది?

ఇక ఏం తోచక కిందికి దిగాడు. తన చుట్టూ కబుర్లు చెప్పేవాళ్లు యూగారు... వాళ్లని వదిలించుకొని భోజనాదికాలు పూర్తి చేసుకునేసరికి ఎనిమిదైంది...

'...ఊరేగింపదీ అయ్యేసరికి రెండవుతుంది...మంగళస్నానాలూ...అన్నీ అవుతోంటే ... తెల్లారిపోతుంది. పెళ్లిపీటల మీద కూర్చుంటారు.'

తల్లి ఎవరితోనో కాలాన్ని విభజించి చెపుతోంది. ఔను. ఇట్టే తెల్లవారిపోతుంది. సుముహూర్తం ముంచుకొస్తోందని పురోహితుడు గోల పెడుతుంటాడు. అగ్నిదేవుణ్ణి అగ్గిపుల్లతో అంటించి ముందు సాక్ష్యం వేస్తారు! వధూవరు లిద్దరూ, బెల్లం జీలకర్ర ముద్దలూ నెత్తిమీద పెట్టించుకొన్నాక మంత్రాంగం సాగుతూంటుంది! కొత్తి జీవితపు వెలుగుచీకట్లు గోచరిస్తాయి ఆ క్షణంనించీ...

తనంటే నాగమణి కంత ఆప్యాయతెందుకు? క్షణక్షణం ఆకర్షిస్తుంది - సలహాయిస్తుంది - సహకరిస్తుంది...ఏవీc లేకపోతే రసవంతంగా మాట్లాడి హృదయాన్ని పులకరిత్తిస్తుంది. ప్రతి సన్నివేశాన్ని మధురిస్తుంది. ఎందుకో ఈ అనుబంధం?... మాధురీమయమైన అర్థం కాని అనుబంధం..? ఆడపెళ్ళివారింటో భోజనాలు కాగానే, అంతా తిరిగి విడిది చేరుకొంటున్నారు... నాగమణికోసం, తనకళ్లు ప్రతీవ్యక్తిని పరీక్షిస్తున్నాయి. ఎందుకో తన హృదయంలో ఆరాటం ఎక్కువౌతోంది!

ఎదురుగా వస్తోంది తలవంచుకొని... 'ఇంత ఆలస్యమైందే?' అన్నవ్యథ అతని చూపులో తురంగలిస్తోంది. 'నీకోసమే సుమా!' అన్న వ్యక్తత ఆకళ్ళల్లో గోచరిస్తోంది...

నాగమణిలో ఇలాంటి హావభావాలేం లేవు. ఉన్నా అతనిదృష్టికి స్పష్టం కావు. పైగా, తనకోసం అతనెందుకుండాలి?... ప్రతీ అడుగులోను గూళ్లు కట్టినఆలస్యం...

మెట్లకిందికివచ్చి, గదిలోకి వెళ్ళిపోబోతోంటే, 'ఒక్కసారి డాబామీదికిరారూ? ...ఎవరూ లేరు' అన్నాడు.

చేయిఊపి, లోపలికి వెళ్ళిపోయింది. నిరాశతో సైకిక్క పచార్లుచేయడం మొదలుపెట్టాడు.

వెనకతట్టునేవచ్చి వెన్నెల తీగల్లాంటి చేతుల్తో తనకళ్లుమూస్తే...? గులాబి పూల గుత్తులు మొహాన్ని కప్పుతూన్నట్టుంటుంది!

అలా ఆలోచిస్తూ, పక్కమీద పడుకుంటే కునుకుపడుతోంది!

నాగమణి ముందు సాక్షాత్కరించి, కిలకిల నవ్వుతూ, పెదవిమీద చేయివేసి సైగ చేస్తోంది!...'ఎవరేనాచూస్తే బావుండదు నేవెళ్ళిపోతాను...' అంటోంది.

తను కలవరిస్తున్నాడు...'నామీద నీకింత అభిమానమెందుకు?' నీచిరునవ్వు చాలు... ఇంకేమక్కర్లేదు! నీవే నా అర్థాంగివైతే... అన్న ఆలోచనే నన్ను పీడిస్తోంది'

నాగమణి కువకువనవ్వి దగ్గరగావస్తోంది! తన ఆహ్వానం అందుకొని...

కిందనించి కేకలు విధివిరామంలేకండా వినిపిస్తున్నాయి. పక్కమీంచిలేచి చూశాడు. అంతా లీల!...తూలుతూ మెట్ల మీంచి దిగిపోయాడు. ఊరేగింపుకు అంతా ముస్తాబౌతున్నారు. అందులో నాగమణీ ఉండిఉంటుంది.

డ్రెస్సదీ వేసుకుని పల్లకీలో కూచుండేందుకు సిద్ధంగా ఉన్నాడు.

...నాగమణికూడా వస్తోంది పల్లకీవెంట ...అదే తన కళ్ళనిండా సంతృప్తిపరిచే అమృతహృదయి...

*                *                *

మంగళవాద్యాల మధుర 'గానం లో, పురోహితుల వేదగానంతో పెళ్ళిపీటల మీద కూర్చుంటే కన్నులపండువగాఉంది. నాగమణిని కళ్లతో వెతుక్కున్నాడు. మనసు వెనక్కు మళ్ళి, ఆయా పరిచిత సన్ని వేశాలమీదకు పరుగులుతీస్తోంది. ప్రతీ మధుర ఘడియలో జరిగిన పలకరింతలూ, పులకరింతలూ...ముద్ర వేసుకొన్నాయి. ఆ పరిచయానికి హృదయం పొంగిపోయింది. నరాలు ఆనందంతో నృత్యం చేస్తున్నాయి.

చేతికి మంగళసూత్రం ఇచ్చారు, పేరమ్మ మెడలో కట్టమని...అందరి చేతుల్ని అందుకొని వచ్చింది. పురోహితుడు కళ్యాణ మంత్రం చెవిలో రహస్యం చెప్పినట్టు చెప్పి చెప్పమన్నాడు. రాజారావు బాజా భజంత్రీల ప్రళయ ధ్వనులలో సరిగా చెవి కందక ఏదో గొణిగాడు. నాగమణి పెళ్ళికూతురి వెనకతట్టునే వుంది.

ముందు కుతూహలంతో జరిగింది!

రాజారావు హృదయం చెంగలించింది.

ఎవరి మెడలో కట్టాలి?......ముందుకు వంగి, పెళ్లికూతురి భారమైన జడ పైకెత్తేరు, మంగళసూత్రం బంధించి మూడు ముళ్లూ వేయమని...

ఆ సూత్రం కాస్తా తప్పించి, నాగమణి మెడలో కడితేకి అమ్మో...! ఇంకేమన్నా వుందా? పెళ్ళికూతురు తండ్రి నగ్గోలెత్తిపోతాడు. భయంకరంగా ఒక్క క్షణంలో తుపాను వీస్తుంది! రాజారావు మెడ నేల కేసి తొక్కుతాడు...నాగమణిని తిట్టి తిట్టి పోగులు చేస్తారు!...రాజారావుకీ ఆలోచన తోచి, నవ్వొచ్చింది.

తలంబ్రాలు పోసుకుంటేటప్పుడు పెళ్లికూతుర్ని ప్రోత్సహిస్తూ, నాగమణి చెవిలో ఏదో చెప్పింది. వెంటనే పళ్లెమెత్తి పెళ్ళికూతురు ఉన్న బియ్యమల్లా అతని నెత్తిన పోసింది! రాజారావు సిగ్గుతో సగం చచ్చిపోయాడు.

పెళ్లి తతంగం పూర్తయేసరికి పూర్తిగా తెల్లవారిపోయింది. నాలుగు వీధులూ ఊరేగించి—విడిది దగ్గరికి తీసుకొచ్చారు.

ఆడవాళ్లు గుమ్మాల చుట్టూ మూగారు పేర్లు చెప్పించమంటూ. రాజారావు ఎందుకొచ్చిన గొడవని, వెంటనే 'పేరమ్మ' అని చెప్పేశాడు. పెళ్లికూతురు ముఖం మాడిపోయింది. ఆడవాళ్లంతా గోలగా నవ్వుతూ 'పేరమ్మ కాదు పేరిందేవి' అని గోల చేశారు.

పెళ్ళికూతురు రాజారావు పేరు చెప్పడానికి నసిగింది. నలుగురూ విసుగుపుట్టి కేకలేశారు. నాగమణి,'రాజారావు బావగారూ నేనూ వచ్చామని చెప్పలేవూ' అంది... తనే ఆ స్థానంలో ఉంటే ఎంత ధీమాగా చెప్పగలదో ఋజావు పరుస్తూ...

'నువ్వే నయమే!' అని నాగమణిని మెచ్చుకొన్నట్టే మెచ్చుకొన్నారు. పేరిందేవి ఉడికిపోయి చెప్పేసింది—

...మధ్యాహ్నం భోజనాల దగ్గర బంతులు వేశారు. రాజారావు కంతమంది ఆడవాళ్ళల్లో తలెత్తుకు తిండానికి సిగ్గూ, వెగటూ. అందులో, ఆ పేరమ్మగారి ఎంగిలి కలవడం—ఆ ఎంగిలి వేదుగా విషతుల్యంగా బాధపడ్డాడు.

రాత్రి భోజనాల అనంతరం విడిదిలోకి వచ్చేశారు. డాబామీద పరుపూ అదీ ఉంది. స్టేట్ ఎక్స్ప్రెస్ సిగరెట్టు పెట్టె కొని ఏకదమ్ము లాగుతున్నాడు. ఆలోచనలతో పొగ లుంగలుంగలు తిరుగుతోంది! వాచీ చూసుకొన్నాడు. పదయింది. అంతా కింద భారంగా పడుకొనిఉన్నారు. మంచినీళ్ల కోసమని కిందికి దిగి, నాగమణిని చూశాడు. నేలమీద బరకంమీద పడుకొని వుంది, కళ్లు కలువల్లా మూసుకొని. బుగ్గలు ఎఱ్ఱ గులాబీలమల్లే ఎలు పెక్కి కొత్త అందాల్ని ఉట్టొంగిస్తున్నాయి. పెదవులు అరుణరాగ రంజితంగా యౌవన ప్రమాదాలకి అపాయ దీపాల్లా రమ్యంగా ఆకాగర్వంగా వెలుగుతున్నాయి. రాజారావు మంచినీళ్ళు మింగి...తొందరలో నాగమణి కాలు తొక్కి ముందుకు పోగాడు. తుళ్లిపడి లేచింది...రాజారావు చేయి ఊపాడు,



# మణిలేని నాగిని



మూగసంజ్ఞ చేసింది. మేడ మెట్లదగ్గరికి వచ్చింది. 'మేడమీద ఎవరూ లేరు రావచ్చు నన్నట్టు సైగచేశాడు. అడుగులు తడబడుతూ అతన్ని అనుకరించి, పై డాబా ఎక్కారు ఇద్దరూ...

'ఇంత రాత్రివేళ మనమిద్దరం ఇలా వుండడంచూస్తే... ఎవరేనా ఇంకేమన్నా ఉందా?...ఏం మాట్లాడరేం?'

నాగమణి ధైర్యంగా అడిగింది.

'ఏమనుకొంటారు...? మనసులు కలిశాయని...'

'పేరమ్మకి తెలిస్తే ఇంకేమన్నా ఉందా? నన్ను కోరత వేయిస్తుంది! అదిగాదు గాని, ఆ అమ్మాయంటే మీరంత అసహ్యంచుకొంటారెందుకూ?'

ఏమో...? ఎందుకో తనకే తెలీదు ఎందుకు ద్వేషిస్తున్నాడో? సరియైన అభిప్రాయం కుదరకపోవడానికి కారణం తను ఆత్మపరీక్ష చేసుకోన్నా సాధ్యం కావడం లేదు! ఆమెని గురించిన ప్రతి విషయాన్నీ హృదయశోధన నాళికలో వేసి, శాస్త్రపరీక్ష చేస్తే ఏ పదార్థం ఫలిస్తుంది? ఆ స్వభావాన్ని తనెలా అర్థం చేసుకున్నాడో తనకే తెలీదు!

'నేను పెళ్ళికూతురితో చాలాసేపు మాట్లాడాను. ఎంతో చక్కగా మాట్లాడింది. నేను మొదట ఎలా పరిచయం చేసుకున్నానో తెలుసా? పెళ్ళికొడుకు నాకు బావగారని...దాంతో ఆవిడ ముఖం విసవిస లాడింది...ఎందుకు చేసుకోలేక పోయావు? అన్నట్టు ఈర్ష్యగా చూసింది.'

రాజారావు కలుక్కుమన్నాడు 'ఇంకా ఏమంది? మీరేం మాట్లాడారు?'

'అంత తొందరపడతారేం? రేపు శోభనం గదిలో అంతా మీకే తెలుస్తుందిగా! అయినా, ఆ అమ్మాయినిగురించి మీరంత వేగిరిస్తారేం? మీది కాకుండా, మరొకళ్లదై పోదుగా!' అంటూ నాగమణి అదోలా విషం చిలకరించి నవ్వింది!

రాజారావుకి వళ్లు మండింది. ఆడదాని గుణం క్షణక్షణం మారి విషపూరితంగా, ఏదో ప్రేలుతూ వుంటుంది!

'నేకిందకి వెళ్ళిపోతాను ఎవరేనా లేస్తారు!...నాతో ఏంమాట్లాడాలని పిలిచారు? వెళ్లిపోతున్నా...'

దిగబోతోంది.

రాజారావు ఛటుక్కున వెళ్ళి చేయి పట్టుకున్నాడు. 'ఆగు! వెడుదువుగాని'—

'చేయి విడవండి! ఎవరేనా చూస్తారు!'

'ఈ చీకట్లో చూడ్డానికి వెయ్యికళ్లేవు. పైకిరా! నీతో మాట్లాడాలి'—

నాగమణి పెనగులాడింది. రాజారావు పట్టు విడవలేదు. 'చాల్లెండి! ఇక వరాభవం...దిగనివ్వండి'

గిజాయించుకొని వెళ్ళిపోయింది గొణుక్కుంటూ.

అక్కణ్ణుంచీ రాజారావుకి కునుకు నిద్ర పట్టింది. ఏవో లీలగా కలలు...కళ్ళల్లో వెలగడం మొదలుపెట్టాయి.

పూర్తిగా తెల్లవారిపోయింది. కిందనించి ప్రయాణ సన్నాహాలు...కేకలూ...అంతా వెళ్లిపోతున్నట్టున్నారు! నాగమణి పైకి వచ్చినట్టే వచ్చి, 'వెళ్లిపోతున్నాం' అని చెప్పి దిగిపోయింది! రాజారావు పలకరిద్దామనైనా అనుకోలేకపోయాడు. వెళ్లిపోయిన దిక్కు చూస్తూ కళ్లు నులుముకొంటూంటే ఆలోచనలు తెరలు వేస్తున్నాయి.

కిందనించి పెద్దగా గోల లేచింది. అంతా భయంకరంగా కేకలు వేస్తున్నారు. 'ఆపండి! ఎవర్నీ పోనివ్వకండి' అందరూ ఆగిపోయారు. ఎవరూ వెళ్ళడంలేదు!

'అందరి పెట్టెలూ సోదా చెయ్యండి!'

'ఏమిటది? ఏం పోయింది?...చంద్రహారమా?...పన్నెండు కాసులట!...... అందరి పెట్టెలు తనిఖీ!'

'ఎవరిది?...పెళ్ళికొడుకు తల్లిది...'

రాజారావు ఒక్క వినురులో కిందకి దిగిపోయాడు. తల్లి నెత్తీ నోరు మొత్తుకుంటోంది. మా పెట్టెలు చూసుకోండంటే, మా పెట్టెలు చూసుకోండంటున్నారు. చిందరవందరగా సామాన్లుతీసి బయటికి పారేస్తున్నారు. రాజారావు ప్రతీ పెట్టె చూస్తున్నాడు.

'అమ్మాయీ! నీ పెట్టేది?' అని నాగమణిదగ్గరికి వచ్చారు. రాజారావు ముఖం పాలిపోయింది. 'ఆ పెట్టెలో ఏం వుంటుందండీ! జాగ్రత్తగా అంతా వెదకండి!' అన్నాడు.

ఎవరో అంటున్నారు 'కొంతమంది పెళ్ళిళ్లకి రావడం ఇదే పనిమీద వస్తారు! పన్నెండు కాసులంటే మాటలటండీ!'

నాగమణి గుండెలు పిటపిటలాడాయి. ఏదో అలజడి ప్రవేశించింది గుండెలో.

'వెళ్ళిపోతాను సెలవిప్పించండి! రైలు టైమయిపోతోంది'—

'దీని అంతు తేలేదాకా ఎవరూ బయటికెళ్లడానికి వీల్లేదు'...తండ్రి గర్జించాడు. 'అందరిదగ్గరా చూశారా?'

'ఈ అమ్మాయెవరూ?' నాగమణి దగ్గరగా వచ్చి, 'ఏదమ్మా నీ పెట్టె తాళం తియ్'—అన్నాడు.

రాజారావు నోరు కదపబోయాడు. 'ఆ పిల్లదగ్గిరేం వుంటుంది పోనీండి!' అంది రాజారావు తల్లి.

'మీకేం తెలీదు. నోరు మూసుకోండి' అని పెట్టె తీయించాడు.

బిక్కుబిక్కుమంటూ తాళం తీసింది. ప్రతీ గుడ్డముడతా తీసి దులపడం మొదలు పెట్టాడు. 'అందులో ఏంవుంటాయయ్యా! చింకిరిగుడ్డలు' అంటున్నాడు రాజారావు. పెట్టెలో బట్టలన్నీ తీసి బయటికి పారేశాడు. అడుగున సిల్కు రవిక ఎవరిదో మెరుస్తోంది!

'ఇది నీదేనా అమ్మాయీ?' అంటూ బయటికి తీశాడు దులిపాడు. అందులోంచి చంద్రహారం బంగారు పిచ్చుకలా ఎగిరి పడింది!

'అదిగో! ఆ రవిక నాదే' అంటూ ఓ మూలనించి కేక రైమని వినిపించింది! ★

# అక్కఱకురాని చుట్టములు

## సి. ధర్మారావు

పరీక్షలయ్యాక జనాగాడూ (జనార్దన రావు) నేనూ ఇంటికి బయలుదేరాము. పరీక్షలయిన తరువాత ఏ విద్యార్థైనా ఓ చిత్రమైన మనస్తత్వంలో పడతాడు. తన జూనియర్ విద్యార్థుల్ని పరదేశ్య క్షుద్రాళ్లని చూసినట్టు జాలిగా, తేలికగా చూస్తాడు. చుట్టూ మనుషులతో కూడ "ఏమిటి, ఈ చిన్న చిన్న విషయాలు అర్థంగాక గగ్గోలు పడి పోతున్నారులావుందే! ఏముందిందులో! ఆగండి, అర్థమయ్యేట్టు చెపుతాను" అన్నట్టు ప్రవర్తిస్తాడు. యుద్ధవీరుడులాగ సంతోషంతో, గర్వంతో పొంగుతూ వుంటాడు. విజయుడులా - అంటే అతను పరీక్షలలో నెగ్గాడనిగాని, నెగ్గుతాననే ధీమా అతనికి వుందనిగాని కాదు. అదో తమాషా. తను ఇంతకాలం నించీ వాటికోసం పడ్డ బాధా, భయం, ఆతురత - అన్నీ యెగిరిపోయి ఎంతో పెద్ద బరువు దింపుకున్నవాడిలాగ తేలిక పడతాడు. ఇంత ప్రపంచంలోనూ తనొక్కడే స్వేచ్ఛగా గాలి పీలుస్తున్నట్టుంటుంది అతనికి.

అలాంటి పరిస్థితిలో మేము ఏలూరుకని వాల్తేరులో మెయిలెక్కాము. ఆ చిన్న పెట్టెలో మేమూ ఇంకా ఏడెనమండుగురు మనుషులూ వున్నాము. క్రిందటిరోజు రెండు సినిమాలు చూశామేమో బద్ధకంగా వుంది. ఎదురెదురు బెంచీలమీద పక్కలు పరిచాము, కాస్త జనాన్ని తెలివిగా సర్ది. కాళ్లు పూర్తిగా చాపేంత లేకపోయినా బాగానే పడుకున్నాము.

కొంతమంది ఆవేళ పేపరు విశేషాలు చెప్పుకుంటున్నారు, కొంతమంది వింటున్నారు. బండి కదలకముందు వూపిరి ఆడని వాళ్లు హాయిగా గాలి పోసుకుంటున్నారు. ఒకరగంటసేపు జనాగాడు రాత్రి సినిమాల గురించీ, శెలవల్లో మేము ఏలూరులో చెయ్యవలసిన కాలక్షేపము గురించీ హుషారుగా కబుర్లు చెప్పాడు. నవ్వుకుంటూనే నిద్రపోయాము.

మళ్ళీ జనాగాడు నన్ను నిద్ర లేపుతున్నప్పటికి ఒంటిగంటన్నరవుతోంది. బడలిక పూర్తిగా తీరిపోయి, ప్రభాతవాయువుల్లో గంగాస్నానము చేసినట్టుంది. బండిలో జనం రద్దీ కొద్దిగా ఎక్కువైంది. మెయిలు సామర్లకోటలో ఆగింది. కొడ్డింగులాగ తాతగార్ని చూస్తాండమని పోయి టీతాగొచ్చాము. జనాగాడు సిగరెట్టు వెలిగించాడు.

బండి సామర్లకోటలో బయలుదేరటానికి ఎంతో టైములేదు. ఇరుకుగా లేకపోయినా పెట్టె నిండుగావుంది. సరిగ్గా అప్పుడే బిలబిలమంటూ పెట్టెలతో, పిల్లలతో హడావుడిగా పెట్టెలో ప్రవేశించారు - రెండుజతల దంపతులు. అంతలోనే పిల్లలు కేరింతలతో కొత్తవాతావరణముతో పరిచయము కల్పించుకుంటున్నారు. తాము ఏవో పనులు చెయ్యకపోవటం వల్ల బండి అందిందో, ఏవో పనులు చేస్తూ కూచుంటే బండి అందకుండా పొయ్యేదో అంత తొందరలోనూ ముచ్చటిస్తున్నారు ఆడవాళ్లూ, పిల్లలలో పెద్దవాళ్లూ. పెట్టెలన్నీ సర్దని కూలీలకి డబ్బులిస్తున్నారు మగవాళ్లు. మొత్తం అంతా అయిదుగురు పిల్లలున్నా, ఇరుతెగల వాళ్లూ కూడా యువదంపతులు. ప్రస్తుతం మంచి 'పొజిషన్'లోనే వున్నారని మాత్రం వాళ్లెక్కించిన ట్రంకుల సంఖ్యని బట్టి చెప్పవచ్చు.

కొత్తనీరొచ్చి కలిస్తే, ఏట్లో లాగ, వీళ్ల రాకతో పెట్టెలో కొంత 'రీషఫ్లింగు', సంచలనము కలిగినయ్. అదివరకు కూర్చుని వున్నవాడు కాస్తా జనాగాడు శుభ్రంగా పడుకున్నాడు. నన్నుకూడ బలవంతాన పడుకోబెట్టేడు. "తవరుమించిన ధర్మం..." అనేదో వాగుతున్నాడు. అవతలి బెంచీల్లో ఆచివర కూర్చున్నవాళ్లు తప్పుకుని ఆడవాళ్లకి, వాళ్లతోవున్న వాళ్ల ఆఖరు పిల్లలకీ చోటిచ్చారు. ఆ తప్పుకున్నవాళ్లు మా బెంచీలవైపుకొచ్చి కాళ్ళ చివర ఇరుక్కున్నారు. ఆమగవాళ్ళలో ఒకాయనా, ఒక ఆడపిల్లా అవతలిబెంచీల్లోనే సర్దుకున్నారు. ఇక ఆరెండోఆయనా, ఇద్దరు పిల్లలూ మిగిలారు. ఆయన మాబెంచీలవైపు కొచ్చి మొహమాటంగా చూస్తున్నాడు. జనా గంభీరంగా పొగవదుల్తూ మాకు తెలియని వ్యవహారమేదో మాట్లాడుతున్నాడు. నాకిది చాల అన్యాయమనిపించింది. పాపమాయనేమనుకున్నాడో యేమో, వెనక్కి తిరిగి వెళ్లిపోయి అవతలి తలుపులోనుంచి బయటకు చూస్తున్నాడు పిల్లలతోసహా. ఏదోరకంగా గండం గడిచిందిరా భగవంతుడా అనుకున్నాను. కాని భగవంతుడు "అబద్ధం" అన్నాడు.

కాస్సేపాగాక ఆ కూర్చున్నాయన అన్నాడు:

"గూడెందాకా నిలబడతావేమిట్రా కృష్ణా? అవతల బెంచీల్లో ఖాళీగానే వుందిగా, ఎక్కడోక్కడ సర్దుకో."

"ఆ, ఫర్వాలేదు లేరా, ఎంతసేపు, నిలబడతాంలే"

"ఏడ్చినట్టేవుంది, నువ్విక్కడ కూర్చో నే వెళ్ళిచూస్తాను"

'కృష్ణ'కి తప్పలేదు. "వద్దులేరా నువ్వక్కడే వుండు, నేనేవెళ్ళి ఖాళీచూస్తాలే" అని బయలుదేరాడు. అంతా గ్రహచారం కాని, ఆ వచ్చేవాడు నావద్దకి రాకూడదూ, లేచి లెగ్గుదులేసి కూర్చోబెట్టేవాణ్ణి!

"కాస్త లెగ్గు ముడుస్తారాండి, పిల్లలకూడ చోటులేదు" అన్నాడాయన జనాతో. వీడు పరిస్థితి నెంతవరకు తీసుకెళ్ళటానికి సిద్ధపడ్డాడో నాకేం అర్థం కావటలేదు.

"వెరీసారీ సర్... మేం ఖరగ్‌పూర్ నించీ వస్తున్నాం, వాల్తేరులోనే ఈ కాస్త చోటు దొరికింది. చాల బడలికగావుంది. మీ రేమనుకోకుండా వుంటే..." కోస్తూ మొహమాట పెట్టాడు జనా. ఇంకేం ఆయన వెళ్ళి ఇవతల 'డోరు' వద్ద నిలబడ్డాడు "ఫర్వాలేదులెండి" అంటూ. ఆ 'కృష్ణ' స్నేహితుడు "ఇవా ఇట్లా అయితే ఎట్లా 'గటాన్' అవుతావురా నువ్వు? వాళ్ళు మాట సాంతం చెప్పకుండానే పరుగెడుతుంటివి" అంటూ చెచిరస్తున్నాడు. నాకీసారి భయమేసింది. జనాగాడు పైగా వాగటంకూడ ఆపేసి 'సీరియస్'గా సిగరెట్టు వెలిగించి తత్త్వవేత్తలా బయటికి చూస్తున్నాడు కిటికీలోనించి. వీడు పెంకిఘటం. ఏమిటి వీడి వుద్దేశ్యం! పైగా ఆడవాళ్లల్లో ఒకామె అంది: "పోనీ, కాస్సేపు నిలబడతారులెండి, వాళ్లుకూడ దూరప్రయాణీకులు గావును." ఆ వచ్చే ఆయనకూడ నిదానస్తుడు కానట్టు ఆమె మాటల్లో ధ్వనించింది. నాకు చెమటపట్టింది. కాని ఎవడి కర్మ కెవరు కర్తలు, ఆయనకూడా ఆ జనాగాడినే అడుగుతున్నాడు! ఛీ అంటే ఛీ అనేవాడే కావాలి మనుషుల్లో

(48- వ పేజీ చూడండి)

యిలా మారిపోవడం చూచి ఆమె మనస్సులో కించపడింది. అయినా మొదట్లో ఉన్న సరదాలు ముచ్చటలు ఎల్లకాలం ఉండమంటే ఎలా ఉంటాయి, అని సరిపెట్టుకుంది కాంతం.

మళ్ళీ కొన్నాళ్లవరకూ ఏ గొడవా రాలేదు. కాని యిదివరకులా చనువుగా మసల్లేకపోయారా భార్యాభర్తలు. ముభావంగా ఎవళ్ల విధులు వాళ్లు నిర్వర్తించుకుపోతున్నారు. మధ్యమధ్య అత్త ఏదో మాట అంటూ ఉండడమూ, దాని కామె బాధపడుతూ ఉండడమూ పరిపాటయి క్రమక్రమంగా బాధపడటం కూడా మానేసింది. రామారావు సున్నితమైన వారి మనస్సులు మొద్దుబారిపోయాయి. ఒకర్నొకరు మాటామాటా అనుకోవడం పరిపాటయిపోయింది.

ఒకరోజున "చిన్నవాడైనేమిటుకు చేసుకున్న దాని అదృష్టం. తెమ్మనగానే పౌడరు డబ్బా, సెంటుబుడ్డీ తెచ్చియిచ్చాడు. మనకా ముద్దూ ముచ్చటలు ఎప్పుడైనా ఉంటేనా, దేనికైనా పెట్టిపుట్టాలి" అని గొణుక్కుంటోంది భర్త వినేటట్టు.

"వాళ్లిద్దరూ నాలుగు కాలాలపాటు చల్లగా కాపురం చేసుకోవడం యిష్టం లేదా. ఎందుకలా కళ్లల్లో నిప్పులు పోసుకుంటావు. అయినా సిగ్గుండక్కర్లే అటువంటివన్నీ అడగడానికి యిన్నేళ్లై కాపురానికొచ్చి" అన్నాడు రామారావు.

ఏదో మాటవరస కన్నదానికి భర్తవద్ద నుండి యిటువంటి మాట వస్తుందని ఆమె ఎన్నడూ అనుకోలేదు. పౌరుషం పట్టలేక "వాళ్లలా ఉన్నారని కాదు. మనకు లేదే అని ఏడుపు." అనేసింది.

"అవును ఏడుపు ముఖాని కెప్పుడూ ఏడుపే" అని బయటికి వెళ్లిపోయాడు రామారావు.

క్రమేణ ఒకర్నొకరు మాటామాటా అనుకోడం, ఏడుపులు, కీచులాటలు వెంకట్రామయ్యగారి చెవుల్లో పడటం, ఆయన గదమాయించడము కూడా జరిగేది.

కాని ఆరోజు జరిగిన చిన్న సంఘటన ఆ యింట్లో యింతటి పరిణామాన్ని తీసుకొస్తుందని ఎవ్వరూ అనుకోలేదు.

మోహనరావు తనకొడుక్కి మూడు చక్రాల సైకిల్ కొనుక్కొచ్చాడు. అలాంటిది తనకూ కావలని మారాము చేస్తోంది రామారావు కూతురు. రామారావు వీధి గదిలో కూర్చుని ఆఫీసుపని చూసుకుంటున్నాడు.

"ఎందుకే ఏడుపు. అది వాళ్లనాన్న తెచ్చాడు. నీకూ కావలనైతే మీ నాన్ననడుగు నన్ను వేధిస్తే ఏంలాభం" అని విసుక్కుంది కాంతం.

పిల్ల తిన్నగా సైకిలుతో ఆడుకొంటున్న పిల్లాడి దగ్గరికెళ్లి లాక్కోబోయింది సైకిల్ని. వాడు ఏడుస్తూ సుళ్ళా లాక్కుం



"దూరాన నారాజు—"

—పి. గజపతిరావు, (శ్రీకాకుళం)

# ★ పెద్దప్రాణం ★

టున్నాడు. ఇద్దరు జుట్టూ, జుట్టూ పట్టుకొని ఏడుస్తున్నారు. కొంచెముసేపు యిది చూచి నవ్వుకున్నా పరిస్థితి విషమిస్తోందని మోహనరావు విద్దర్నీ విడదీస్తున్నాడు మంచి మాటలతో.

"పాత సైకిల్ తెచ్చి హాయిగా ఉన్న యింట్లో గోల తెచ్చిపెట్టారం"ది తోటి కోడలు రత్నం నవ్వుతూ.

కాంతం ఉడుకు మోత్తనం పట్టలేక పోయింది. "గోలకాకపోతే మరేమిటమ్మా. దీనితో పడవలసి వస్తోంది అడ్డమైనమాట లూను. వానసైనా వచ్చిందికాదు దుర దృష్టపు పీనుగు" అని కూతురు వీపుమీద వాలుగు బాదింది.

"ఏదో మాటవరసకంటే అలా బాదేస్తా రేమిటక్కా" అంది రత్నం పిల్లను ఊరుకో పెడుతూ.

అంతసేపు ఆఫీసుపని చేసుకుంటున్న రామారావు కోపం పట్టలేకపోయాడు. చరచర లోపలికొచ్చి కాంతాన్ని చెళ్లున లెంప కాయకొట్టి బయటకు పోతున్నాడు.

అంతా చూస్తున్న వెంకట్రామయ్యగారు ఏమీ అనలేకపోయారు. ఎవర్నంటే ఎవరికి కోపమొస్తుందో; తన కిద్దరూ కొడుకులే, యిద్దరూ సమానులే. కాని పెద్దకొడుకు కోడలిమీన చెయ్యి చేసుకు నేసరికి ఆయన పెద్దతనము ఉంచబట్టలేకపోయింది. అది ఆయన కెంతో అవమానంగా తోచింది. "అప్రయోజకుడా ఆడదానిమీద చెయ్యి చేసుకుంటావుట్రా. ముందు వెనుక లాలో చించక్కర్లే. ఏదో చిన్న పిల్లలకయ్యానికి" అన్నాడు.

"నువ్వూరుకోవయ్యా ఏదో ముసలాడివి. కృష్ణా రామా అనుకోక నీకెందుకీ గొడవ" అని విసుక్కుని బయటకుపోయాడు రామారావు. ఎప్పుడూ మాట కెదురాడని పెద్ద కొడుకు తన్నిలా ఛీత్కరించి మాట్లాడే సరికి ఆయన అభిమానపడ్డాడు. పెంచి పెద్ద చేసే వరకేకాని తరువాత వాళ్లదే కాబోలు పైచెయ్యి అని మాట్లాడకుండా కూర్చున్నారు.

రామారావు కోపంలో ఏదో అనేశాడే కాని తరువాత తండ్రిని అన్న మాటలు తనకే వింతగా తోచాయి. విద్యాబుద్ధులు చెప్పించి, పెంచి పెద్దచేసిన తండ్రికి యిదేనా తను చెయ్యవలసిన మర్యాద? వెళ్లి క్షమాపణ చెప్పుకుందా మనుకున్నాడు. కాని అభిమానం అడ్డొచ్చింది. ఏదీ తోచక పార్కులో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

అనుకోకుండా జరిగిన సంఘటనకు చిన్నకోడలు రత్నం రూంలో కళవళ పడింది. "ఎందుకు తెచ్చారండీ ఆ పాత సైకిల్. పచ్చని సంసారములో పగలు బయలుదేరాయి" అంది భర్త మోహన్‌తో.

"నేనుమటుకనుకున్నానా యిలా జరుగుతుందని. అయినా అన్నయ్య అంత తొందరపడతాడని అనుకోలేదు."

"ఆవిడ దసలే అభిమానంగల మనిషి. మాట పడదు అని" రత్నం అంటూండగానే కాంతం కట్టుగుడ్డలతో పిల్లనెత్తుకొని బయటకు పోతోంది.

"అదేమిటే కాంతం అలా వెళ్లిపోతున్నావు. ఎక్కడికి?" అని వెంకట్రామయ్యగారంటూండేసరికి మోహనరావు, రత్నం బయటకొచ్చారు.

"అదేమిటో చూడరా బాబు. దాని కసలే పౌరుషం. కోపములో ఏమిచేసినా చేస్తుంది" అని మోహనరావుని తొందర పెట్టి పంపి కుర్చీలో కూలబడిపోయాడు వెంకట్రామయ్యగారు గుండె పట్టుకొని.

"అదేమిటి మామయ్య అలా ఉన్నారు" అంది ఖంగారుగా రత్నం.

"ఏమీ లేదమ్మా. గుండెల్లో దడ మంచి నీళ్లియ్యి" అన్నారు కళ్లుమూసుకొని.

రత్నం తెచ్చియిచ్చిన మంచినీళ్లు రెండుగుక్కలు తాగి "ఇలాంటివన్నీ చూడటానికే కాబోలు బ్రతికున్నదింకాను. అదృష్టవంతురాలు. ఏ పుణ్యము చేసుకుందో పోయింది ఇవన్నీ చూడకుండా" అని ఒక నిట్టూర్పు విడిచారు.

"మీరలా కించపడి అధైర్యపడకండి మామగారు. అన్నీ తెలుసున్నవారు మీరే అలా అనుకుంటే ఎలా చెప్పండి? ఏదో ఉద్రేకంలో అనుకొన్న మాటలు ఎల్లకాలము ఉంటాయా. పరిస్థితులన్నీ చక్కబడతాయి. మీ రనవసరంగా గాబరాపడి ఆందోళన పడకండి."

"నువ్వలా అనుకుంటావు కానీ అమ్మా చిన్నతనంచేతనే విరిగిన మనస్సులు అతకడం కష్టం. మాటామాటా వచ్చిన కుటుంబంలో శాంతి నిలవడం కష్టమమ్మా. ఊహూ. ఏమనుకొంటే ఏమిలాభం. అన్నిటికీ వాడే ఉన్నాడు పైన."

మామగారి మనస్సు బాగా విరిగిపోయిందని బాధపడింది రత్నం. అనవసరంగా మాట్లాడి ఆయన మనస్సు యింకా కష్టపెట్టడ మిష్టంలేక మాట్లాడకుండా ఉపచర్యలు చేస్తూ అలా ప్రక్కనే కూర్చుంది.

ఇంతలో మోహన్ తొందరగా వచ్చి "ఎంత చెప్పినా వినకుండా వాళ్ళ ఊరెళ్ళిపోయింది వదిన టిక్కట్టు కొనుక్కొని" అన్నాడు.

"ఏడుస్తూ ఉంటే చూస్తూ ఊరుకున్నారా" అంది రత్నం.

"ఎందుకూరుకున్నాను. రైలు కదిలేవరకూ చెప్పిచూచాను. వింటేనా? నీకు తెలీదు మోహన్. వెళ్లనియ్యి. నన్ను బలవంతం చేయకు" అని ఒకటే పట్టు.

వెంకట్రామయ్యగారు ఒక్క నిట్టూర్పు విడిచి ఊరుకొన్నారు.

"మామగారి ఒంట్లో గాబరాగా ఉంది.



ముసురు మబ్బులు

ఫోటో: బి. రంగనాథన్.

వెళ్ళి మీ అన్నగారెక్కడున్నారో చూచిరండి" అంది రత్నం

మోహనరావు ఊరంతా గాలించి చివరికి పార్కులో కలుసుకున్నాడు సంపెంగ చెట్టుక్రింద తలవంచుకు కూర్చుని ఆలోచిస్తున్న అన్నగారిని. వెళ్ళి మాట్లాడకుండా ప్రక్కనే కూర్చున్నాడు.

"ఏమిరా తమ్ముడూ నాన్న మనస్సు కష్టపెట్టుకున్నారా నేనన్న మాటలకి. కోపంలో వళ్లు తెలీకుండా అనేశా."

"దానికేంలే అన్నయ్యా. అసలు వదిన సంగతాలోచించు. కట్టుగుడ్డలతో వెళ్ళిపోయింది."

"ఆ! వెళ్ళిపోయిందా!" అని తెల్లబోయాడు రామారావు. మళ్ళీ "పోతే పోయిందిలే" అని తమాయించుకున్నాడు.

తరువాత కొద్దిసేపు ఎవరూ మాట్లాడలేదు. రామారావే కొద్దిసేపాగి "చిన్నప్పుడెంత యిదిగా ఉండేవాళ్లం. భార్యలొస్తే యింతే కాబోలు. పెద్దవాళ్లూరికే చెబుతారా."

"ఇప్పుడేమి లోటొచ్చిందన్నయ్యా మనకు? లే. నాన్నగారూరికే యిదౌతున్నారు. ముసలికాలంలో ఆయన మనస్సు కష్టపెట్టడం మనకు భావ్యం కాదు."

ఆ సంగతి నాకు తెలీదురా తమ్ముడూ. ఆయన ఎదుటపడటానికి ముఖం చెల్లటం లేదురా!"

"అలా అనుకుంటే ఎలా అన్నయ్యా కోపంలో పదిమాటలనుకుంటాము. వాటన్నిటినీ పట్టించుకుంటే ఎలాగ? లే!" అన్నాడు మోహనరావు. అన్నదమ్ములిద్దరూ యింటిముఖం పట్టారు.

"నేను బ్రతికుండగా మాత్రం యీ యింట్లో యిటువంటి పని జరగడానికి వీల్లేదు. ఫలానా వెంకట్రామయ్యగారి కోడలు పుట్టింటికి వెళ్లిపోయిందంటే నలుగురిలో ఎంత తలవంపు నాకు. వెళ్లి కాంతాన్ని తీసుకురండి ఏదో విధంగా నచ్చచెప్పి" అన్నారు వెంకట్రామయ్యగారు.

"మనతో చెప్పేవెళ్లిందా మనం పిల్చుకు రావటానికి? దానిష్టమొచ్చినప్పుడే రానియ్యి. నువ్వెందుకు నాన్నా అలా యిదౌతావు?" అన్నాడు రామారావు పౌరుషంగా.

"నువ్వు కోపంతో అలా అంటావుగాని నీకేమి తెలుస్తుందిరా చిన్నవాడివి? ఇంట్లో పెదవాడుండే యిలా చేయించాడంటే నలుగుర్లో ఎంత చిన్నతనంరా బాబు నాకు"

తరువాత అందరు ఆలోచించి మోహనరావుని పంపటానికి నిశ్చయించుకొన్నారు వదినగార్ని తీసుకురావడానికి.

"మీ రవతే దుడుకురకం. కోపంలో ఒకవేళ అక్కయ్య ఏమన్నా అంటే పట్టించుకోక శాంతంగా పిల్చుకురండి" అంది రత్నం.

"నువ్వేం చెప్పక్కర్లేదులే, ఆ సంగతి నాకూ తెలుసు" అన్నాడు మోహనరావు.

"దాన్నలా అంటావేమిరా చిన్నపిల్ల" అన్నారు వెంకట్రామయ్యగారు.

"అవును పాపం! యిప్పుడే పుట్టింది" అన్నాడు మోహనరావు.

"తను నెప్పుడూ అంతేలే మామయ్యా" అంది రత్నం.

"అది మావంశ పారంపర్యా వచ్చిన హక్కులే అమ్మా" అన్నారు వెంకట్రామయ్యగారు. ఆమాట కందరూ నవ్వుకున్నారు రామారావుకు మాత్రం హృదయంలో ఎక్కడో ముల్లు గుచ్చుకున్నట్టయింది.

అలిగి వెళ్ళిన కాంతం [illegible]

#  పెద్దప్రాణం 

బండి దిగేసరికి ఆశ్చర్యపోయారు రామం తల్లి దండ్రులు.

"ఇదేమిటే యిలా వచ్చేశావు ఒక్క ఉత్తరమైనా వ్రాయకుండా" అంది తల్లి.

"అతనికి సెలవు దొరకలేదా?" అన్నాడు తండ్రి.

"లేదునాన్నా" అని ముక్తసరిగా జవాబిచ్చి యింట్లోకి పోయింది శాంతం.

మర్నాడే మోహనరావు బండి దిగేసరికి అసలు సంగతి బయటపడింది.

"అందుకే నే నప్పుడు మొత్తుకున్నది. వియ్యానికైనా కయ్యానికైనా సమాన స్థాయీ ఉండాలండీ అని. ఆ మాత్రం కావలసినవి అడిగి చెప్పించుకోదానికి నోచుకోలేదా మన పిల్ల, యింత గారాబంగా పెరిగి" అని బుగ్గలు నొక్కుకుంది శాంతం తల్లి.

"ఏదో కోపంలోను, పట్టుదలతోను కాపురాలే కూలద్రోసుకుంటారా, అమ్మా. సంసారమన్నాక ఆ మాత్రం ఒడుదుడుకులు రాకుండా ఉంటాయా. వర్ధమ్మ పోవాలి గాని, అతని సంగతిమటుకు నీకు తెలియదు? ఏదో మాటా మాటా వచ్చి రెండు మాటలంటే యిలా వచ్చేస్తారటమ్మా" అని సర్ది చెప్పబోయాడామె తండ్రి.

"నాకుమటుకు తెలీదా నాన్నా ఆ సంగతి. ఆ మాత్రం సర్దుకుపోకపోతే చేసేనా యిన్నాళ్ల కాపురం? అక్కడి పరిస్థితులు ఎలా పరిణమించాయో నీకు తెలీదు నాన్నా. అయినా ఎందుకులే ఆ సంగతులన్నీ ఎవరి ఖర్మాని కెవరు కర్తలు" అని వెక్కి వెక్కి ఏడుస్తూ తన గదిలోకి పోయింది.

"అమ్మోయ్ నా పిచ్చితల్లి. దాని మనస్సెంత కష్టపడకపోతే యిలా యిదౌతుంది. ! అదేపోయిన కాపురం గాని యిక్కడే ఉందిమమ్మ నాలుగు కాలాల పాటు. మాకేం వదిలుందున్నారు కనుకనా? ఒక్కగా నొక్క కూతురు. నాకేం బరువు కాదు."

తరువాత భోజనాలు చేసేటప్పుడయినా మోహనరావుకి కనుపించలేదామె. అతనే కూడకట్టుకుని "అయిందేదో అయిపోయిందత్తయ్యా. ఇంటిపద్దు నాన్నగారు రెంటో యిదౌతున్నారు. అన్నయ్యకూడా మనస్సు కష్టపెట్టుకుంటున్నాడు వదిన్ని పంపించదత్తయ్యా" అన్నాడు మోహనరావు.

"వదినట వదిన! ఇంత ప్రేమ ఉండబట్టే యింటినుంచి యిగరల గొట్టేవరకు ఒక్కొలాగున్నారు. దాని ప్రాణమెంత యిదైందో వెర్రితల్లి. అంత ప్రేమ ఉండితే అతనే రాలేకపోయాడా" అని యీసడించుకుందామె తల్లి.

"నాలుగు రోజులాగి, ఆ కోపమేదో చల్లారితే అదే సరిపెట్టుకుంటుంది లేవోయి. నేనే తీసుకొచ్చిదిగ పెడతాలే" అని సర్దాడు తండ్రి.

మోహన్కి చేసేదేమీ లేక తిరిగి వెళ్ళిపోయాడు. రోజులు గడిచిపోతున్నాయి. శాంతం వచ్చే జాడ కనిపించ లేదు. "నువ్వు నా వెళ్ళి తీసుకురాకూడదురా దాన్ని. వెర్రిపిల్ల" అని పలాయించే వాడు వెంకట్రామయ్యగారప్పుడప్పుడు పెద్ద కొడుకుని.

"నీకు తెలీమలే నాన్నా. అదే వస్తుంది, అంత కాపుర మవసరమైతే" అనే కొడుకుని చూచి ఆయనేమీ మాటాడలేక మౌనం దాల్చేవాడు. క్రమక్రమంగా వెంకట్రామయ్యగారి ఆరోగ్యం క్షీణిస్తోంది బెంగతో. గుండె దడకూడా ఎక్కువయింది. వళ్ళంతా నీరు పట్టిపోయింది. రామారావు శ్రద్ధగా వైద్యం చేయిస్తూనే ఉన్నాడు. పరిచర్యలకు లోటు లేదు.

అప్పుడప్పుడంటూ ఉండేవారు "కోడల్ని తీసుకురారా బాబు పట్టుదలకుపోక. ఇంకెంతకాలమో బ్రతకను. మీరంతా కలిసి మెలిసి కాపురం చేసుకుంటూంటే చూచి యీ కొస్త ప్రాణం విడుద్దామని." మొదట్లో నిర్లక్ష్యం చేసేవాడు రామారావాయన మాటలకు.

"ఇప్పటి కుర్రాళ్లంతా యింతే. పెద్దవా

క్షేమన్నా అంటే చాదస్తం అంటారు" అని నిట్టూర్చేవారు.

పరిస్థితి మరింత విషమించింది. వెంకట్రామయ్యగారికి సంధి బయలుదేరింది. ఏవో అర్థంలేని మాటలు మాట్లాడుతున్నారు డాక్టర్లు లాభంలేదని పెదవి విరిచారు.

"కాంతం - అంత పట్టుదలయితే ఎలాగమ్మా ఇవతల నా ముఖమైనా చూచావు కావు" అని తనలోనే గొణుక్కుంటున్నారు.

"అన్నయ్యా నాన్నగారి పరిస్థితి రోజు రోజుకి విషమిస్తోంది. ఎప్పుడూ వదిన్ని గురించే ఆ పిచ్చిధోరణి కూడా. వెళ్లి తీసుకురాకూడదూ వదిన్ని" అన్నాడు మోహనరావు. చేసే దేమీ లేక బయలుదేరాడు రామారావు అత్తగారింటికి.

ఇంతకాలం పుట్టింటిలో గడిపిన కాంతానికి అక్కడి జీవితము కూడా విసుగ్గానే తోచింది. పౌరుషం, అభిమానం అడ్డు వస్తున్నాయి అత్తగారింటికి వెళ్లడానికి. ఎవరైనా వచ్చి పిలిస్తే బాగుండును వెళ్ల వచ్చు అన్నంతవరకు వచ్చింది పరిస్థితి. హటాత్తుగా బండిదిగిన రామారావుని చూచి ఆశ్చర్యపోయారంతా. భర్తకి ముఖం చూపించలేక కాంతం గదిలోకి పోయింది.

"ఇన్నాళ్ళకా నాయనా మనస్సుపోతా వెళ్ళింపింది?" అని పుల్లవిరుపుమాట అనేసింది అత్తగారు

మామగారేదో సర్ది చెప్తూ "యింటివద్ద అందరూ కులాసా?" అన్నారు.

అత్తగారన్నమాట కష్టమనిపించినా "నాన్నగారు చావుబ్రతుకుల్లో ఉన్నారు. కాంతాన్ని గురించి ఒకటే కలవరింతలు. తీసుకెడదామని వచ్చాను." అన్నాడు.

ఈ మాట వినేసరికి కాంత మిక గదిలో ఉండలేకపోయింది. కళ్లనీరు పెట్టుకుంటూ బయట కొచ్చేసింది.

కాంతాన్ని చూడగానే రామారావు "నా కోసం కాకపోయినా ముసలాడికోసమైనా ఒకసారివచ్చి ఆయన అవసానదశలో తుది కోర్క తీరుస్తే బాగుంటుంది" అన్నాడు ఎవరికో చెప్తున్నట్టు యింకోప్రక్కకు ముఖం త్రిప్పి.

"అదేమిటండీ అలా అంటారు. నా మామగారు చావుబ్రతుకుల్లో ఉంటే నాకు గాక మరెవరికి" అని వలవల ఏడ్చింది కాంతం.

"అంతా అయింతరువాత ఏడ్చినటుకు లాభమేమిటి? తొందరగా బయలుదేరండి, బండి టైమవుతోంది" అన్నాడు కాంతం తండ్రి.

"ఏ కూటిచిలుక ఆ పలుకు పలుకుతుందని ఊరికే అంటారా" అని విస్తుపోయింది కాంతం తల్లి.



# తగ్గమేళం ★ ★ ★ ★ కొయ్యతాళం

సృష్టిలో కన్పించే విపరీతాల్లో ఒకటి ఏమిటంటే, డబ్బు ఇనప్పెట్టెల్లో మూల్గుతూ సంతానం కావాలో మొర్రో అని కన్పించిన దేవుడికల్లా మొక్కేవాళ్లకు పిల్లలు కలక్కపోవటం; ఏరోజు కారోజు గడవటం ఎల్లాగా అని సతమతమయ్యేవాళ్లు, వచ్చే నాల్గురాళ్లూ చాలక నానా అవస్థలు పడేవాళ్లు, గంపెడు సంతానంతో (అదీ ఈ కట్నాలయుగంలో ఆడపిల్లల్తో) అగచాట్ల పాలవటం. సీతమ్మగారు కూడా ఇటువంటి ఇబ్బందికే గురయ్యారు.

సీతమ్మగారిది ఏమంత ఉన్న సంసారం కాదు. ఆమె భర్త రావుగారు పేరుకు మాత్రం లాయరు: ఆయన సంపాదించేది అయిదుగురు ఆడపిల్లలుగల ఆ కుటుంబానికి చాలటం అంతంత మాత్రం. ఏది ఎట్లాగైనా ఆ సంసారం గుట్టుముట్టుగా గడిచిపోతోంది. అయితే వాళ్లను పట్టి పీకుతున్నదల్లా పిల్లల పెళ్ళి సమస్య. కట్నాలు యివ్వటానికి తాహతు లేదు. అల్లాగని తన కుటుంబాన్ని పోషించుకోగల ఏ బీదవాడికో పాదవాడికో ఇవ్వటానికి పరువు...పలుకుబడి...తమ వారు నల్గురూ నవ్విపోతారేమోనని భయం. నిజంగా ఈ మధ్య తరగతివారి జీవితం మహాయాతన. అటు భాగ్యం పూజ్యం గాబట్టి భాగ్యవంతులు వీళ్లను దగ్గరకు రానీయరు. ఇటు బీదవాళ్లలో కలటామూ, ఏమిటో లేని ప్రతిష్ఠ, సంఘంలో స్థానం ఇవన్నీ అడ్డు.

రావుగారు మునివంటివాడు. కుటుంబ విషయాలు ఆయనకేం పట్టవు; పట్టించుకోను కూడా. సంపాదించే కొద్దో గొప్పో తెచ్చి భార్యచేతిలో పోయటంవరకే ఆయన పని. కుటుంబ వ్యవహారాలన్నీ సీతమ్మగారే నిర్వహిస్తున్నది. బాల్యంలోనే తల్లిదండ్రుల్ని పోగొట్టుకొని తమ ఇంట్లో పెరుగుతున్న మేనల్లుడు ఆమెకు సహాయం.

ఇంట్లో ఎదిగిన ఆడపిల్లలున్నారే, వారి గారికి అనవసరం, ఒకవేళ భార్య ఎప్పుడైనా ఆ విషయం ఎత్తితే, సందర్భం మార్చి, ఏదో పనివున్నవాడిలా ఆఫీసు రూములోకి వెళ్లి పుస్తకాల్లో మునిగి పోవటం ఆయనకు పరిపాటి. పరాయివాళ్లెవరైనా పిల్లల వివాహప్రసక్తి తెస్తే, "ఇంతకూ ఆరోజు రావద్దటండీ! కళ్యాణం వచ్చినా కక్కువచ్చినా ఆగుతుందా!!" అంటాడు.

సీతమ్మగారికి రావుగారికి మధ్య ఏటువంటి కలతలు కొట్లాటలు లేవు, ఆయనగారు తనకు తానై ఏమీ చేయడు. భార్య చెప్పితే కాదనడు. ఆమె ఏదైనా చేస్తే వద్దనడు. ఆఖరుకు భోజనంకూడా ఆమె వడ్డించి పిలిస్తే వెళ్తాడు. లేదా, భోజనం

## రామ్‌చంద్

అంటే ఏమిటో తెలియనట్లు తన పుస్తకాల్లో మునిగిపోయి ప్రపంచాన్నే మరిచి పోతాడు. అంతమాత్రంచేత సీతమ్మగారు భర్తపై అధికారం చలాయిస్తున్నదనుకోవటం పొరపాటు. ఉత్తమ ఇల్లాలు. రోజురోజుకు కుటుంబ ఖర్చులు మితి మీరి పోతున్నాయి. ఎంత పొదుపుగా వాడినా రావుగారి సంపాదన చాలకుండా వుంది. ఆయనమాత్రం ఏం చేస్తాడు! ఇటు లాయరువృత్తే గాకుండా ఈమధ్య ఏవో ట్యుటోరియలు స్కూల్లో రాత్రిళ్ళు పాఠాలు చెప్పటానికి కూడా కుదిరాడు. ఇంత చేస్తున్నాకూడా గడవటం బ్రహ్మప్రళయంలాగుంది. సంపాదనకోసమే ఇల్లా సతమతమౌతున్న భర్తను కుటుంబ వ్యవహారాల్లో మరీ బాధపెట్టట మెందుకనే సీతమ్మగారు ఇంటి బాధ్యతను పూర్తిగా స్వీకరించింది. అందుకనే వారిల్లు ప్రశాంత వాతావరణంతో ఎల్లప్పుడూ కళకళలాడుతుంటుంది, ఎన్ని సమస్యలున్నా. వారినిచూచి ఈర్ష్యతో ఎలుగుతూ నాలుగు మాటలనుకోవటం కద్దు, రావుగారు చేతగానివాడని, [illegible] మగరాయుడని. అసలు నేటి లోకానికి వున్న పాడుబుద్ధే ఇది; ఒకరు సుఖంగా వుంటే ఏడ్వటం, వాళ్లు ఏడుస్తుంటే వీళ్లు నవ్వటం.

ఇంతకూ సీతమ్మగారిని బాధిస్తున్న సమస్య పిల్లలపెళ్లి. ఆడదైనా మగవాడైనా తనే అయి, బాధ్యతంతా నెత్తిన వేసుకొని, ఇరుగువాళ్లను పొరుగువాళ్లను మంచిచేసుకొని ఎట్లాగో అయిదుగురు కూతుళ్లలోనూ పెద్దవాళ్లు యిద్దరికీ పెళ్లి అయిందనిపించింది.

* * *

ఆరోజు మధ్యాహ్నం సీతమ్మగారు భోజనం చేసి, చాపమీద పడుకొని తాంబూలం సేవిస్తుండగా, హఠాత్తుగా ఆమెకు ఓ ఆలోచన తట్టింది, గుంటూరు ఎందుకు వెళ్ళిరాకూడదూ అని. అంతక్రితంరోజు ఆమె పక్కింటి పూర్ణమ్మగారింటికి పేరంటానికి వెళ్ళింది. అమ్మలక్కల లోకాభిరామాయణంలో, గుంటూరులో గౌరీనాథశాస్త్రిగారున్నారని, ఆయన కుమారుడు గణపతి ఆమధ్య ఏదో పెద్దపరీక్షే ప్యాసని, ఆ అబ్బాయి కింకా పెళ్ళికాలేదని, సంబంధాలు ఎన్నో వచ్చి పోతున్నాయని, శాస్త్రిగారు అభ్యుదయవాదులవటంవల్ల కట్నాలు కానుకలు తీసుకోరని వార్తలు పారాయణమయ్యాయి. సీతమ్మగారు వారు చెప్పిన ప్రతిమాటా తనకు సంబంధం లేదన్నట్లు మౌనంగానే విన్నది. పేరంటంనుండి తిరిగొచ్చినప్పటి నుండీ ఆమె కెందుకో ఈ సంబంధంపై

మనస్సు పోసాగింది. గుంటూరులో తెలిసిన వాళ్లెవరూ లేరు.

రావుగారు పథ అంటే అర్నెల్లేని మనిషి. ఆయనకు తీరికనేది ఏమాత్రం లేదు. అసలు ఆయనకు ఇటువంటి విషయాల్లో లౌక్యం తెలియదు. కాబట్టి తనే స్వయంగా, మేనల్లుడ్ని తీసుకొని వెళ్ళి రావటం మంచిదనే నిర్ణయానికి వచ్చింది.

ఆ నిర్ణయంతో, సాయంకాలం రావుగారు కోర్టునుండి తిరిగిరాంగానే, ఓ కప్పు స్ట్రాంగ్ కాఫీతో బడలిక తీర్చి, చిరునవ్వుతో తను గుంటూరు వెళ్తున్నానని చల్లగా చెప్పింది.

రావుగారు మందహాసం చేసి, "ఎందుకో" అని నసిగాడు.

"ఏమీ లేదు...అట్లా వెళ్లి మా వాళ్ళను చూచివద్దామని. ఇప్పుడు గాకపోతే ఇంకెప్పుడు పడుతుంది!" అన్నది ఆమె.

ఆమె చూచి రాబోయే దినవాళ్ళెవరో రావుగారికి అర్థంగాలా. పిల్లల పెళ్ళి విషయమై వుంటుందనుకున్నాడు. అడగటం ఎందుకులే అనుకొని, "నీ ఇష్టం, అంతా వేసంగిలో కూనూరో, బెంగుళూరో వెళ్తుంటే నీవు గుంటూరు వెళ్తానంటున్నావు. నా అభ్యంతరం ఏమీ లేదు," అని ఫలోక్తి విసిరాడు.

* * *

అనుకున్న ప్రకారం సీతమ్మగారు శంకరాన్ని తీసుకొని మరునాడు గుంటూరు బయలుదేరింది. సాయంకాలం తెనాలిలో బండిమారి చీకటి పడుతుండగా గుంటూరు చేరారు. స్టేషన్నుండి జట్కా చేసుకొని నేరుగా గౌరినాథశాస్త్రిగారిల్లు చేరుకున్నారు.

గౌరీనాథ శాస్త్రిగారిది పెద్ద డాబా. ముందు చిన్న తోట. కాంగ్రెసంటే ఆయన కెంతో అభిమానం. దేశసేవకై ఎన్నోసార్లు జైలుకు వెళ్ళాడు. ఏదో పెద్దలు సంపాదించిన ఆస్థివుంది. అదీ గాకుండా తరతరాలనుండి వస్తున్న వైద్యం చేతిలో వుండనేవుంది. గౌరీనాథ శాస్త్రిగారంటే బీద బిక్కాకు వల్లమాలిన అభిమానం. ఆయన హస్తవాసి మంచిదని, ఆయనేం యిచ్చినా వ్యాధి ఇట్టే నయమవుతుందని ప్రతీతి. ఆయన కుమారుడు గణపతి యమ్. యస్. సి మొదటి తరగతిలో కృతార్థుడై ప్రస్తుతం పరిశోధన చేస్తున్నాడు. గౌరినాథ శాస్త్రిగారు కట్నాలు కానుకలంటే మండిపడతాడు కాని ఈ మధ్య ప్రాణమిత్రుడూ జిల్లాజడ్జీ చేసి రిటైరయిన శివశంకర శాస్త్రిగారి పోరు పడలేక ఏదో పదిహేనుకు తగ్గకుండా ఆయన కూతు [illegible]

సంబంధం నిశ్చయించుకున్నాడు. పోతే ఆయనకో కుమార్తెవుంది. పేరు శాంత. ఈ మేరి నాలుగు సంవత్సరాలయినా పెళ్లి విషయం ప్రస్తావనకు రాలేదు. కారణం శాస్త్రిగారే. భార్య ఎంత మొత్తుకున్నా విన్పించుకోని ఘటం అది. "చచ్చినా కాని కట్నం ఇవ్వను. అందుకు సిద్ధమైవస్తేనే పెళ్ళి" అంటా డాయన.

సీతమ్మగారెక్కి వచ్చిన జట్కా శాస్త్రిగారింటిముందు ఆగింది. సీతమ్మగారూ శంకరం బండిదిగి బాడుగిచ్చి వాడ్ని పంపేశారు. ఇంటిముందు బండి ఆగటం, ఎవరో దిగటం శాస్త్రిగారి భార్య తాయారమ్మగారు కిటికీలోనుండి చూచింది. సమయంగాని సమయంలో వచ్చేవాళ్లెవరా అని గుమ్మంలోనుండి తొంగిచూచి, ఎవరో గుర్తుపట్టలేక పనిమనిషిని పంపింది తెలుసుకొని రమ్మని.

"ఓవర్సీర్ సూర్యంగారి ఇల్లు ఇదేనమ్మా," తెలుసుకుందామని వచ్చిన పనిమనిషిని సీతమ్మగారు అడిగారు.

"ఓవర్సీర్ గారిల్లు ఇదికాదమ్మా," అంది పనిమనిషి.

"ఎక్కడుంటున్నారో తెలుసా?"

"నాకేం తెలుస్తుందమ్మా, వారెక్కడుంటారో. ఇంటినంబరు తెలియదూ..."

"అదే మర్చిపోయొచ్చాను. గౌరీపురంలో వుంటున్నారని ఇదివరలో చెప్పారు. పట్నంనుండి తెనాలివచ్చి, ఏదో చూచిపోదామని వచ్చాను. నా కర్మగాకపోతే అడ్రసు తెచ్చుకోనూ. ఈ చీకట్లో ఎక్కడికి పొయ్యేది?" సీతమ్మగారు అయోమయంగా అన్నారు...

ఇదే సమయానికి తాయారమ్మగారు గూడా బయటకువచ్చింది. బయటకు రావటం రావటం ఆమె దృష్టి శంకరంమీద పడింది. తన కూతురుకు ఇటువంటివాడు దొరికితే ఎంత బాగుండ్ను అనుకొంది ఆమె. సీతమ్మగార్నడిగి విషయం కనుక్కొంది. 'అయ్యో పాపం! ఇప్పుడెక్కడకు వెళ్తారమ్మా, మేమూ సాటివాళ్లమేగా ...ఈ రాత్రికి మా ఇంట్లో వుండి ప్రొద్దుటే వెళ్దురుగాని." ఒక్కసారి తాయారమ్మగారికి జాలిపుట్టుకొచ్చింది. సీతమ్మగారు మొదట తటపటాయించినట్లు కన్పించినా, తర్వాత ఒప్పుకొంది లోలోపల సంతోషిస్తూ తన పాచిక పారినందుకు.

ఆరాత్రి అంతా తుష్టుగా భోంచేసి డాబాపైన చేరారు. అటు గౌరీనాథశాస్త్రిగారు, శంకరం ఓ ప్రక్క చేరి బాతాఖానీ వేస్తున్నారు. ఇటు ఆడవాళ్లిద్దరూ చేరి లోకాభిరామాయణం మొదలుపెట్టారు. [illegible]

మొదలుపెట్టడమూ అని తటపటాయిస్తున్నది. తాయారమ్మగారు శంకరాన్ని గురించిన భోగట్టాకోసం ఆదుర్దాపడుతున్నది. చివరకు సీతమ్మగారు తెగించి అడిగింది, "మీకు పిల్లలెందరమ్మా," అని.

"ఇద్దరు. పెద్దవాడు యమ్. యస్. సి. ప్యాసై. ప్రస్తుతం పరిశోధన చేస్తున్నాడు. ఈమధ్యే సంబంధం నిశ్చయమైంది. ఇహపోతే రెండోది శాంత. శాంత పెళ్లికోసం ప్రయత్నం చేస్తున్నాం. ఎన్ని సంబంధాలొచ్చినా నచ్చటంలేదు. ఏదో పరువుప్రతిష్ఠకలవాళ్లకోసం వెదుకుతున్నాం..." తాయారమ్మగారు చెప్పుకుపోతున్నారు. సీతమ్మగారికి అవేమీ పట్టలా, ఒక ప్రక్క చల్లటి గాలి వీస్తున్నా ఆమెకు చెమట పోయసాగింది. "పిల్లబ్బాయికి పెళ్లి నిశ్చ

యమైందా! ఎంత మోసం! ఎంత మోసం! తను కొంచెం ముందు వచ్చినా బాగున్ను," ఆమె పరధ్యానంలో పడిపోయింది.

తాయారమ్మగారు తన సోదంతా చెప్పి, శంకరాన్ని గూర్చి తరచి తరచి అడిగింది. సీతమ్మగారికి అర్థమైంది, ఆమె కన్ను శంకరంపై పడిందని. అప్పటి కేదో ముక్తసరిగా చెప్పి తప్పించుకొంది.

ఆ రాత్రంతా సీతమ్మగారికి నిద్రలేదు. పాపం ఆమె మనస్సు కలతపడింది. అంత దూరంనుంచి ఎంతో ప్రయాసపడి వస్తే చివరకు తేలింది ఇదా! అయినా సరిగ్గా విషయాలు తెలుసుకోకుండా బయలుదేరటం మాత్రం ఏం బాగుంది?

తెల్లవారింది. తాయారమ్మగారు ఎంత చెప్పినా వినక, కాఫీకూడా పుచ్చుకోకుండా బయలుదేరారు సీతమ్మగారు. వచ్చేటప్పుడు తాను మద్రాసు వచ్చినప్పుడు తప్పక తమ యింట్లో దిగవలసినదని ఎంతగానో చెప్పి, అడ్రెసు ఇచ్చి బయలు దేరింది.

ఆరోజు సాయంకాలం రాఘవగారు కోర్టునుంచి వచ్చి నిట్టూర్పులు విడుస్తూ వాకిట్లో కూర్చున్న భార్యనుచూచి ఆశ్చర్యపోయారు. కుశలప్రశ్నలు తప్ప మరేమీ అడక్కుండా ఇంట్లోకి వెళ్ళిపోయారు.

* * *

ఓ పదిరోజులు ప్రశాంతంగానే గడిచాయి. తరువాత ఓరోజు సాయంకాలం సీతమ్మగారింటిముందు టాక్సీ ఒకటి ఆగింది. తాయారమ్మగారూ కొడుకూ దిగారు. ఇదంతా గమనించి చూస్తున్న సీతమ్మగారు గబగబా క్రిందికి దిగివచ్చి, జీతగాని చెవిలో గుసగుసలాడి పంపింది.

"సీతమ్మగారిల్లు ఇదేనా?" తాయారమ్మగారు అడిగారు.

"ఇది కాదండి," జీతగాడు నదురూ బెదురూ లేకుండా సమాధానం చెప్పాడు.

"ఇదే అడ్రెసు. ఆమె స్వయంగా వచ్చినప్పుడు ఇక్కడే వుంటున్నామని చెప్పారు."

"వారిప్పుడు ఇక్కడ లేరమ్మా ఇల్లు ఖాళీచేశారు..."

"అయ్యోరామా! ఒక్క కార్డుముక్క రాయగూడదూ! పోనీ ఎక్కడుంటున్నారో తెలుసా?"

పనిచేసే కుర్రవాడు తలగోక్కుని, అమ్మగార్ని అడిగి కనుక్కొస్తానని ఇంట్లోకి వెళ్ళి తిరిగొచ్చాడు. "గుంటూరు వెళ్ళిపోయార్టమ్మా అంతే."

"గుంటూరు వెళ్ళారా...బాగావుంది. ముందుగా తెలియపరిస్తే ఇంతదూరం ఆదరా బాదరా రాకుండా తప్పేదే..." తాయారమ్మగారు బరువుగా నిట్టూర్పు విడిచారు.

అంతవరకూ ఎంతో ఓర్పుతో నిలబడ్డ శంకరం ఒక్కసారి విదిలించాడు తల్లిని...

"నీ కెప్పుడూ ఇంతేనమ్మా....నీకు నా ఒక్క ఉత్తరం వాళ్ళకు వ్రాశావా?... ఇప్పు డేమనుకొని మాత్రం ఏంలాభంలే... టాక్సీ ఎక్కు. ఈ రాత్రికి ఏదైనా హోటల్లో ఉండి రేపు ఎక్స్‌ప్రెస్‌లో తిరుగు ముఖం పడదాం." ★

## మబ్బులు పెట్టిన ముగ్గులు

ఫోటో: జి. ఎస్. శర్మ (తేల్ప్రోలు)



# వనితాలోకం

## అబద్ధాలలో నిజానిజాలు

"పరులపట్ల జాలికొద్దీ అబద్ధాలాడేవాళ్లు చాలమంది ఉంటారు. అతి రమ్యంగా, అద్భుతంగా, కవిత్వం చెప్పినట్లు కొందరు అబద్ధాలాడేస్తారు. కొన్ని అబద్ధాలు ఉపశమనం కలిగిస్తాయి. కొన్ని అబద్ధాలతో మనుషులు తమ దుర్గతిని అర్థం చేసుకుని జీవితంతో రాజీపడతారు....గుండె నిబ్బరం లేనివాళ్లు, ఇతరుల చెమటోడ్చి తెచ్చే అన్నంపైన ఆధారపడేవాళ్లు - వీళ్ళకి అబద్ధాలు అవసరమౌతాయి. దుర్బలులైనవారికి అబద్ధాలు నిలువనీడలు. వంచకులు, పరపీడనాపరుల దుర్నీతికి అబద్ధాలు పట్టు తెరలు. స్వతంత్రుడు, నిగ్రహదక్షుడైనవాడు, పరులపై ఆధారపడ నవసరం లేనివాడు అబద్ధాలతో అవసరం లేకుండా కార్యసాధకుడౌతాడు. అసత్యమనేది బానిసల మతం, యజమానుల మతం. సత్యం స్వతంత్ర వ్యక్తికి దైవసమానం."

—మాక్సిమ్ గోర్కీ.]

కొమ్మూరి ఉషారాణి

మనుష్యుల ముఖకవళికలనిబట్టి వారి మాటల్లోని సత్యాసత్యాలని గ్రహించవచ్చుననే విశ్వాసం కొందరి కుంటుంది. అంతటి శక్తి జ్ఞానం మనకున్నాయని అనుకోవటం చాలా సాహసమే నని తోస్తుంది. అలాటి అపోహ ప్రమాదకరం. ఆ విశ్వాసం అహంకారమే అయినా, అజ్ఞానమే అయినా, ఆత్మవంచనమటుకు తప్పక అవుతుంది. మనతో మాట్లాడుతున్న వ్యక్తులు పూర్తిగా అసత్యం పలుకుతున్నారని గానీ, పూర్తి సత్యమే పలుకుతున్నారని గానీ నిర్ణయించటం కష్టం. అలా సత్యాన్వేషణ కోసరం తాపత్రయపడుతూ కూర్చుంటే మనం ఎక్కడికి పోతామో మనకే తెలియదు. నిత్యం అనుమానాలతో అపోహలతో బాధపడే వ్యక్తులకంటె ఎదటివారి ప్రతివాక్యాన్నీ సత్యమని నమ్మే అమాయకులే, ఎక్కువ సుఖపడతారనీ, మనశ్శాంతిని పొందగలరనీ అంటారు కొందరు.

"అబద్ధం" అన్న ముక్క వినగానే సహజంగా మనందరికీ ఆగ్రహం కలుగుతుంది. ఎవరైనా అసత్యం పలికారని తెలిసినా, ప్రత్యక్షంగా ఋజువైనా, వారిని అసహ్యించుకుంటాము. ఒకప్పుడు వప్యా జాలీ గూడా కలుగుతాయి. అబద్ధాలవల్ల కలిగే లాభనష్టాలమాట ఎలావున్నా, ఈ జాడ్యాన్ని నయం చేసుకోవటంమటుకు చాలా కష్టమని చాలామంది ఋజువు చేస్తున్నారు. అబద్ధాలు పలకటం పాపహేతువనీ ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చటానికి పది అబద్ధాలు ఆడవలసిన అవసరం కొంతప్పుడు కలుగుతుందనీ, మనం అబద్ధమాడుతున్నామని ఎదటివారు తెలుసుకున్నప్పుడు సిగ్గువేస్తుందనీమటుకు ఒప్పుకు తీరాలి.

కానీ ప్రాణంమీదికి వచ్చినప్పుడు తమనీ యితరులనీ గూడా కొన్ని చిక్కు పరిస్థితులలో అబద్ధాలు ఆడవలసివస్తుంది. అవసరమైనప్పుడు అబద్ధాలాడవచ్చునని శుక్రుడు బలిచక్రవర్తికి బోధించాడు. అలా గాక బొత్తిగా అనవసరమైనప్పుడూ, అతిసామాన్యమైన విషయాలలోనూ, అబద్ధాలాడే వాళ్లని చూస్తే చిరాకు కలుగుతుంది. ఎదటివారిని కాస్త రంజింపజేయటానికీ ఉత్సాహపరచటానికీ అబద్ధాలాడేవారిని చూస్తే నవ్వు గూడా వస్తుంది. కానీ వారికి అనుకూలంగా వుంటేటప్పుడు ఎదటివారు అబద్ధాలు చెబుతున్నారని తెలిసి గూడా సత్యమని నమ్మి ఆత్మవంచన చేసుకుంటూ వుంటారు కొందరు.

"ఆడవాళ్లకి అబద్ధాలు చెప్పటంలో వున్నంత నేర్పు మరి దేనిలోనూ లేదు" అంటారు ఒకరు. "అది కాదండీ! వాళ్లకి బుద్ధి చపలత్వం, అనూయ అబద్ధాలు ఎక్కువ. ఏ విషయం పైకి అనని వారు లోలోపల అలా అనుకుంటారు" అంటారు ఇంకొకరు. మన

# అబద్ధాలతో నిజానిజాలు

పురాణకాలంలో గూడా స్త్రీలనిగురించి "అనృతం సాహసం మాయా వంచనం చలచిత్తతాం" అని చెప్పారు. ఈ గుణాలన్నింటినీ స్త్రీల నెత్తినే రుద్దారు. మరి ఇవి పురుషులకి మటుకు లేవా అనేదే ప్రశ్న. స్త్రీ పురుషులిద్దరు గూడా పరిస్థితులనుబట్టి ఈ బలహీనతకు లొంగిపోతూ వుంటారేగానీ ఎక్కడో పురాణాల్లో చెప్పారుగనుక స్త్రీలు అబద్ధాలు ఎక్కువ చెబుతారనే వాదనని సాగదీసుకుంటూ పోవటం పొరబాటు. అది స్త్రీలకి అన్యాయం చెయ్యటం, అనవసరమైన అపవాదుని ఆమెమీద వేయటం అవుతూంది.

ఉన్నదానికి నాలుగు కల్పించి అతిశయంగా మాట్లాడే వ్యక్తులు మనకి తరుచూ ఎదురవుతూ వుంటారు. అటువంటివారిని అబద్ధీకు లనటముకంటె ఎదటివారు తెలుసుకోలేనంత చాకచక్యంతో అబద్ధాలాడటం చేతకాలేదు అంటే బాగుంటుందేమో. చీరఖరీదు ఒక అయిదురూపాయలు ఎక్కువ చెప్పి, వయసు విషయంలో ఓ నాలుగు సంవత్సరాలు తక్కువచెప్పి తృప్తిచెందే స్త్రీలని చూస్తే కొంతప్పుడు సరదాగా గూడా వుంటుంది. సున్నితహృదయాలు గలవారూ అమాయకులూ అయిన స్త్రీలకి పెద్దఎత్తున అబద్ధాలాడి మనుష్యులని నిలువునా నాశనంచేసే శక్తిగానీ ధైర్యంగానీ సాధారణంగా వుండదు. పరిస్థితుల ప్రోద్బలాన్నిబట్టి స్త్రీలు అల్పవిషయాలలో అబద్ధాలు చెప్పడానికి అలవాటు పడ్డారని తోస్తుంది.

ఇంట్లో ఒక చిన్న విషయాన్నే తీసుకుందాం. పక్కింటామె ఏదైనా వస్తువు అడిగినప్పుడు "లేదు" అనవలసిన పరిస్థితి ఒకొక్కప్పుడు కలుగుతుంది. "లేదండీ" అనటం సులభం కావచ్చు. "కొద్దిగా వుంది గానీ మాకు కావాలి" అనటం కొంత కష్టం కావచ్చు. "మా దగ్గిర వుందిగానీ మీకు యివ్వం. పోయిన మాటు వస్తువు మీరు తిరిగి యివ్వలేదు" అని కుండ బ్రద్దలు కొట్టినట్లు ముఖంమీద అనటం చాలా కష్టం. మరి అటువంటి పరిస్థితిని తెలివిగా పరిష్కరించుకుంటేగానీ వేరేమార్గం లేదు.

అలాగే పదిమంది వుండే ఓ పెద్ద కుటుంబంలోని యువతి కోడలుగా వెళ్ళే యింట్లో ఒక్క భర్తని అర్థంచేసుకుని కాపురం చెయ్యడమే గాకుండా, అత్తగారూ ఆడబిడ్డలూ మొదలైనవారి తత్వాలనీ నైజాలనీ అర్థం చేసుకుంటూ అతిజాగ్రత్తగా మెలగవలసి వుంటుంది. ఆ యింట్లో ఒకరిమీద ఒకరికుండే రాగద్వేషాలు కొన్నాళ్లకు ఆమెకు బోధపడతాయి. తోడికోడళ్లు అత్తగారిమీద చాడీలు చెప్పి అవతలకి వెళ్ళంగానే 'ఏమే కోడలా! నన్ను గురించేనా ఆ గుసగుసలు' అని అడిగే అత్తగారంటే ఆమెకి హడలు పుట్టుకొస్తుంది. కొంచెం గడుసుదనం వుండీ ధైర్యస్థురాలయితే ఏదో సర్దిచెప్పి అత్తగారిని మంచి చేసుకుంటుంది. అదే పిరికిదీ లోకజ్ఞానం తెలియనిదీ అయితే అబద్ధాలాడి అత్తగారికి దూరమవటమో, నిజం చెప్పి తోడికోడలు ఆగ్రహానికి గురి అవటమో జరుగుతుంది. అబద్ధాలాడటంవల్ల యింట్లో అందరి అభిమాన అనురాగాలు పొందగలరనే నమ్మకం కలిగినట్లయితే, అబద్ధాలాడటం క్రమంగా అలవాటయిపోతుంది.

ఇంట్లో వస్తువు లయిపోయాయని భర్త దగ్గిరనుంచీ ఓ అయిదు రూపాయలు ఎక్కువ సేకరించి బట్టలు కొనుక్కునే యిల్లాలిని తీసుకుందాం. 'ఈ మాత్రానికే అబద్ధం ఆడటం దేనికి. నన్ను అడుగుతే నుందే యివ్వనా' అంటాడు భర్త. కానీ అతనికి తెలుసు తనకి వచ్చే జీతం ఖర్చుపెట్టటానికి భార్యకి ఏమాత్రం స్వాతంత్ర్యం యిచ్చినా ఆమె అలా అబద్ధమాడదని. భర్త విసుక్కుంటాడనీ కోప్పడతాడనీ భయపడే ఆమె అబద్ధమాడుతుంది. కొత్తగా పెళ్ళయిన యువకుడు భార్యని కూర్చోబెట్టి కాలేజీలో తన ప్రతాపాలు ఏకరవు పెడతాడు. భార్యకి అటువంటి విషయాలు పైకి చెప్పటానికి ధైర్యం లేకపోవటంమాట అటుంచి, ఎవరినైనా వివాహం చేసుకోవాలని అనుకున్నట్లు పైకి అంటే భర్త ఉగ్రుడైపోతాడు.

అకస్మాత్తుగా యింటికి వచ్చిన అతిథుల నుద్దేశించి "ఇప్పుడే మీ విషయం అనుకుంటున్నాము. వారం రోజులనుంచీ మీ యింటికి తీసుకువెళ్ళమని వారిని పోరుతున్నాను" అనే భార్యవంక భర్త కొంచెం అనుమానంగానూ సంతోషంగానూ చూస్తాడు. అతిథులు వెళ్ళిపోయిన తరువాత ప్రతి విషయంలోనూ భార్య అలాగే మాట్లాడుతుందేమో ననే అనుమానంతో తప్పకుండా బాధపడతాడు. అలాగే ఆఫీసులో శెలవుకి దరఖాస్తు పెట్టే పురుషుడు దాదాపు ప్రతిసారీ తాతగారి తద్దినమనో, మేనమామ చచ్చిపోయాడనో వ్రాస్తే, పై ఆఫీసరు చిరాకుపడతాడు. ఇలా అతిసామాన్యమైన విషయాలలో అబద్ధాలాడటం కొందరికి తప్పనిసరి అవుతుంది; కొందరికి ఓ జబ్బుకింద తయారవుతుంది.

ఈ బలహీనతని పెంపకానికి అంటగడతారు కొందరు. లేదు అటువంటి పరిస్థితి భయంవల్ల కలుగుతుందంటారు కొందరు. ఇంట్లో వేరే వృత్తి వ్యాపకం లేకపోవటంవల్ల స్త్రీలు తరుచూ ఈ దౌర్బల్యానికి గురి అవుతారనే వాదన గూడా ఒకటి వుంది. తల్లితండ్రులిచ్చే శిక్షణ, పిల్లలు పెరిగే వాతావరణం అబద్ధాలు చెప్పే బలహీనతకి ఆధారమవుతాయి. చిన్నతనంలో ఉన్నదున్నట్లు చెబితే ప్రమాదమనీ, అవతలవాళ్లు నొచ్చుకుంటారనీ అనుమానంలో పెరిగే వ్యక్తులు పైకి అబద్ధమాడకపోయినా ఏవిషయాన్నయినా మనసులో దాచుకోవటం జరుగుతుంది. సాంఘికజీవితంలో పాల్గొనటానికి అవకాశాలు లేక, ప్రపంచ జ్ఞానం అలవరచుకోవటానికి సరైన మార్గాలు దొరకక, పరిమితజీవితం గడిపే స్త్రీలు, అబద్ధాలు చెప్పకపోతే ఎదటివారిని సరిగ్గా రంజింపచేయలేమనే అనుమానంతో కొంతప్పుడు బాధపడతారు.

కొన్ని సత్యాలు అసత్యాలేమో ననే అనుమానం కలిగిస్తూ వుంటారు కొందరు. "మావారు ప్రాక్టీసు పెట్టినప్పటినుంచీ వూళ్లో అందరికీ జబ్బుల భయం పోయింది. మా అబ్బాయి ఒక్కరోజు స్కూలు మానేస్తే స్కూలంతా చిన్నబోయినట్టు వుంటుందిట. టీచర్లంతా యింటికి పరుగెత్తుకొస్తారు" అనే ధోరణిలో మాట్లాడేయిల్లాలు మనలో విచిత్రమైన అనుభూతిని కలిగిస్తుంది. నిజంగా సొంతవాళ్లమీద అపేక్షా గౌరవం వుంటే, అది నలుగురి ఎదుటా నాటకఫక్కీలో బయటపెట్ట నవసరంలేదు. తమలోవుండే గొప్పతనాన్నీ సహృదయతనీ నిరూపించడానికి, స్ఫురింపజేయటానికి, కొన్ని సత్యాలనే అసత్యాలేమో అనే అనుమానం కలిగించేటట్లు మాట్లాడుతారు.

అబద్ధాలుచెప్పే దురలవాటు వున్న వ్యక్తులు ఎదురైనప్పుడు కసురుకునీ దూషించీ, అసహ్యించుకుంటే, భయంవల్ల అబద్ధాలు చెప్పే బలహీనత ఎక్కువై, వారు మనకి యింకా దూరమైపోతారు. అబద్ధాలు చెప్పేవారిని కేవలం చీడపురుగులకింద అసహ్యించుకునే యువకుడికి అతిచులాగ్గా అబద్ధాలు చెప్పే భార్య తటస్థపడిం దనుకోండి. ఇంట్లో అత్తగారుగానీ ఆడబిడ్డలుగానీ ఆమె అబద్ధాలు చెబుతోందని భర్త ఎదట నిరూపించడానికి పది





# నేటి స్వయంవరాలు



**అన్నపూర్ణ**

పూర్వకాలంలో వివాహాలు జరిగాయంటే అవి పిల్లల చిన్నతనంలో పెద్దలు తమ ఇష్టానుసారం ముదుగా జరిపేవారు. ఇందులో వధూవరుల ఇష్టాయిష్టాల కేమాత్రం ప్రాముఖ్యత లేదు. అయినప్పటికీ ఆ వివాహాలూ ఆదర్శప్రాయంగానే ఉండేవి. ఆ దాంపత్యాలు చిరకాలం వర్ధిల్లేవి. ఇక క్షత్రియుల్లో స్వయంవరాలు జరిపేవారు. కన్యలకు యుక్తవయస్సు వచ్చిన తరువాత ఉన్నతవంశ సంజాతులైన రాజపుత్రుల నాహ్వానించేవారు. అందులో నచ్చినవారిని కన్యలు వరించేవారు. కాని ఈనాడు ఆవిధంగా ఏ దమయంతీ 'సిత పుష్పదామాభి శోభితహస్తయై' వచ్చి ఏ నలునీ వరించడం లేదు.

ఆనాటి పరిస్థితులు వేరు, ఈనాటి పరిస్థితులు వేరు. నాటి సమాజం వేరు, నేటి సమాజం వేరు. నేను విద్యావంతులమంటూ విర్రవీగుతున్నారు యువతీ యువకులు. కాని స్త్రీలు ఆనాడు కూడ విద్యావతులే. కళల నభ్యసించినవారే. కలలో చూచిన సత్యవంతుని రూపమును చిత్రపటము వ్రాసిన సావిత్రి. ఎవరెన్ని చెప్పినను వినక 'మనోవాక్కాయములన, మూడు తెరంగులందు అంతఃకరణం బవఘు ప్రధానంబు గావున మనమున గైకొన్నవరుని మానందు నే' యని చెప్పి అల్పాయుష్కుడని లెక్కచేయక ఆ సత్యవంతునే వరించినది సావిత్రి.

కాని నేను అట్లుగాదు. యువతీ యువకులు పాశ్చాత్య విద్యాప్రియులు. తల్లిదండ్రులు చదువు చెప్పిస్తున్నారు. అది ఎందుకో వారికే తెలియదు. దానికొక లక్ష్యము లేదు. దానికొక విలువ లేదు. గాంధీజీ చెప్పినట్లు ఈ విద్య వారి కెంతమాత్రం తోడ్పడ్డం లేదు. డిగ్రీవచ్చిన తరువాత ఆ డిగ్రీ తెచ్చుకోడానికి కూడ డబ్బు లేని పట్టభద్రులు కావలసినంతమంది. యువకులు ఉద్యోగంకోసము చదువుతున్నారు. యువతులు మరొకందుకు. ఇంక ఇలా చదువుకున్నందువలన వచ్చే లాభం కనిపించడం లేదు. ఎంత చదువుకున్నా స్త్రీలలో ఉద్యోగాలు చేసేవారి సంఖ్య తక్కువే. ఉద్యోగం చేయమని పంపించ సాహసించే తల్లిదండ్రులు కనిపించరు. స్త్రీలకు పరిపడిన ఉద్యోగాలూ లేవు. దానికనువైన పరిస్థితులూ లేవు. అలా ప్రోత్సహించే వ్యక్తులూ లేరు. అటువంటి సమాజమూ కాదు మనది. అందుచేత ఈనాడు ఏ అమ్మాయినైనా ఎందుకు చదువుతున్నావంటే ఏమీ చెప్పలేదు. ఎవరి తాహతును బట్టి వాళ్లు చదువుకుంటున్నారు. కొందరు చదివించడం యిష్టంలేక మానిపించేస్తారు పెళ్ళిచేద్దామని.

కాని పెళ్ళంటే మాటలా? ఎన్ని కావాలి? ఎన్ని వరాలు. ఆడపెళ్లివారికి చదువూ, సంస్కారమున్న యువకుడు కావాలి. ఇక మగపెళ్ళివారికి చదువుకునీ, వంట నేర్చిన యువతీ, కట్నమిచ్చే మామా కావాలి. ఇన్నీ సమకూర్తాయా – ఐనప్పటికీ ఎవరి ప్రయత్నం వారిది.

ఈ మధ్య కొన్ని వివాహసమస్యలు – కొన్ని విన్నవి, చూసినవి ముచ్చటిస్తాను. మాఊళ్లో ఒకమ్మాయి ఉంది. బి. ఏ. చదువుతూండేది. ఆ అమ్మాయి థోర్డుఫారంలో ఉన్న దగ్గరనుంచి వాళ్ల నాన్నగారు సంబంధాలు చూడ్డం మొదపెట్టారు. బి. ఏ. కూడా అయిపోవచ్చింది కాని ఎక్కడా సంబంధం కుదరలేదు. ఇంట్లో భార్యపోరు పడలేక వెతకగా వెతకగా ఎం. ఏ. పాస్ అయిన ఒక వరుని కుదిర్చారు. అతనికి కాలేజీలో లెక్చరర్ పని. సరే చదువుకున్న అమ్మాయి నచ్చినదన్నాడు. నాలుగువేలు కట్నమిస్తామన్నారు. ఆ అమ్మాయి చదువు పూర్తయాక చేసుకుంటానన్నాడుట. సరే సెలవలకి వీళ్లఊరు వచ్చాడు. అతని తాతగారిదికూడ అదేఊరు. అందుచేత వీరింటికి వారు వారింటికి వీరు వెళుతూ పోతూ ఉండేవారు పెద్దవాళ్లు 'చదువుకున్న వాళ్లు మీకు సిగ్గేమిటి' అన్నారు.

సరే స్వేచ్ఛ యిచ్చినదే తడవుగా గోదావరి గట్లమీదా, బజార్లో, సినిమాల్లో, ఎక్కడ చూసినా ఈ జంటే తిరిగినవాళ్లు తిరిగారు. తీరా పెళ్లి కుదిర్చి అన్నీ చేసి ముహూర్తం పెడతామంటే, ఆ పెళ్ళికొడుకు అన్నాడుట 'మీ అమ్మాయి పెళ్లి కాకుండానే నాతో ఇంత నిర్భయంగా, సోషల్ గా తిరిగింది. ఇలా కాలేజీలో ఇంకెంత మందితో తిరిగిందో నాకు వద్దుఅన్నాడుట. ఇటువంటి సంకుచితాభిప్రాయాలుగల యువకులింకా మన సమాజంలో ఉంటే ఏమిచెయ్యడం? అతనిని ఎవరూ ఏమీ అనలేదు. కాలేజీ స్టూడెంట్సు దగ్గరనుండి ఊళ్ళో ముసలివాళ్లవరకూ అందరూ ఆ అమ్మాయినే నిందించారు – ఆడపిల్లకంత ధైర్యమేమిటని. ఇంక ఆ అమ్మాయి నెవరు చేసుకుంటారు. ఇందులో తప్పెవరిది చెప్పండి?

ఇంకా ఇలాంటి వెన్నో. ఒకమ్మాయి చదుమీద అభిలాషకొద్దీ ఎం. ఏ. వరకూ చదివింది. ఎంత చదువుకున్నా పెళ్లి తప్పదన్నారు పెద్దలు. అయితే వరుడుమాత్రం ఆమెకన్నా ఎక్కువ చదవాలి. వీళ్ళు మాత్రం దమ్మిడీకట్నమివ్వరుట అమ్మాయికి. అబ్బాయిలకి పుచ్చుకోరుట. ఇంక పెళ్ళి

---

మాట్లు అబద్ధాలాడించి ఆనందం పొందుతే లాభం లేదు. తాము తప్పుచేశామని ఎదటివారు తెలుసుకున్నప్పుడు సిగ్గుపడే బాధపడే తత్వంగల మనిషయితే వెంటనే అది కప్పిపుచ్చటానికి ఓ అబద్ధం ఆడేస్తుంది. అలా గాకుండా అబద్ధాలాడటంలో వర్ణించలేని ఓ ఆనందాన్ని పొందుతూ గర్వపడే వ్యక్తులూ వున్నారు. ఈ రెండు రకాల మనుష్యులకీ మధ్య వుండే తేడాని సులభంగా కనిపెట్టవచ్చు. 'ఏమే పులుసులో ఉప్పు ఎక్కువ వేశావేం' అనే అత్త 'లేదత్తయ్యా! ఉప్పు దొన్ని, తీస్తుంటే కిందపడిపోయింది' అని సమాధానమిచ్చే కోడలివంక అత్త గుర్రుగుమి చూస్తుంది. కానీ తనని రంజింప చేయటానికి, భయంవల్లా అలా అబద్ధమాడిందని తెలుసుకోదు. అలా భయంవల అబద్ధాలాడేవారిని సహృదయంతో అర్థంచేసుకుని వీలైనంతవరకు ఆ భయం పోగొట్టటానికి ప్రయత్నించాలి.

మనకు అయిష్టమైన వ్యక్తులని మనం ఈ జీవితంలో కొంతప్పుడు భరించవలసి వస్తూవుంటుంది. నిజం వున్నదున్నట్లు ముఖంమీద చెప్పేవారుగూడా ఈ జాబితాలోకే వస్తారు. వారిని మనం అసహ్యించుకుంటాము. సంస్కారం లేదనీ మానవత్వం లోపించిందనీ రకరకాల పేర్లు పెట్టి వెక్కిరిస్తాము. కానీ అటువంటివారు మనకి చాలా మేలుచేస్తుంటారు. వారిమాటల్లోని సత్యం జీవితంలో మనకి ఎప్పుడో ఒకప్పుడు గురుకువస్తుంది. కానీ దురదృష్టవశాత్తూ సత్యాన్వేషణకోసం తాపత్రయపడే వ్యక్తులు చాలామంది సత్యాలు పలికే వారిని ఎక్కువ ఆదరించలేరు. ★





# నేటి స్వయంవరాలు



కాని యువకుల జాబితా వారి చదువు, వయస్సు, గోత్రాలు అన్నీ విపులంగా తెలిసికోగా ప్రయత్నించగా ఒక యువకుడు కనిపించాడు. అతడు అప్పుడే అమెరికానుంచి వచ్చిన నవనాగరికుడు. కట్నం తీసుకోడు. అతని కోరిక ప్రకారము ఈ అమ్మాయిని, బొంబాయి తీసుకురమ్మంటే వెళ్ళారు. ఈ అమ్మాయి నచ్చిందన్నాడు. ఈ అమ్మాయిని తప్పించి నేనింక ఎవరినీ చేసుకోనని చెప్పి అక్కడే ఉంగరాలు మార్చాడుట. ఆ అమ్మాయిని డాన్సు నేర్చుకోమన్నాడు, ఎందుకంటే తను విదేశాలు వెళ్ళిపోతే అక్కడ ఇద్దరూ కలిసి నృత్యప్రదర్శనాలిస్తారుట. సరే పాపం బాల్ రూము డాన్సు నేర్చుకుంది. తీరా పెళ్ళి చేసుకోమంటే అన్నాడుట ఎంత చదువుకున్నా మీ అమ్మాయిలో సంస్కారం లేదు; ధైర్యం లేదు. నా ఫ్రెండ్స్ నవ్వుతున్నారు అన్నాడుట. ఫ్రెండ్స్‌కి నచ్చలేదని పెళ్లి మానేసిన విద్యావంతుడైన యువకుని మనస్తత్వాన్ని తెలిసికోగలిగేవారెంతమంది వున్నారు? ఆ అమ్మాయికి సంస్కారము లేదుట. అతని కున్నదా సంస్కారం? విద్య దేన్నిస్తోంది ఈనాడు? విజ్ఞానాన్ని ఇవ్వడం లేదు; వినోదాన్నిస్తోంది. సంస్కారులమంటారు. సంస్కారము రావలసింది వేషభాషలలో కాదు భావాలలో.

ఒక యువకుడు బి. ఏ. అవగానే కలకత్తాలో ఓ కంపెనీలో చేరాడు. అతనికి తల్లి లేదు. తండ్రి ముసలివాడు. తండ్రి ఏ కూతురింట్లోనో కాలం గడిపేవాడు. ఈ యువకుడు కలకత్తాలోనే ఒక పార్శీని చేసుకున్నాడు. ఇది తండ్రికి తెలియదు. ముసలివాడైపోతున్నాడు. బెంగతో కొడుకును రమ్మని వ్రాయగా వ్రాయగా వచ్చాడు. తండ్రి చెప్పిన అమ్మాయిని తండ్రిని ఎదిరించకుండా చేసుకోడానికి ఒప్పుకున్నాడు. అందరూ ఎంతో బుద్ధిమంతుడన్నారు. వేసవికాలంలో వచ్చి చేసుకుంటానన్నాడు. తీరా కలకత్తా వెళ్ళి మొదటిభార్యతో ఈ సంగతి చెప్పేసరికి ఆమె ఒప్పుకోలేదు. కోర్టు కీడుస్తానంది. ఇంక భయపడ్డాడు. ఇక్కడ తండ్రి ఎన్ని ఉత్తరాలు వ్రాసినా జవాబివ్వడు. తండ్రే బయలుదేరాడు. తీరా అక్కడికి వెళ్ళి చూసేసరికి ఆయన గుండెలు జారిపోయాయి —ఆ ఇంటిని ఆ మనుష్యుల్ని చూసేసరికి. ఆ యువతినీ ఆమె కట్టు ఆ తీరు చూసి బెంబేలు పడిపోయాడు. కొడుకుని పిలిచి అడుగుతే చల్లగా అంతా చెప్పాడు. మరి ఎందుకు ఆ అమ్మాయిని ఒప్పుకున్నావంటే, "ఆ అమ్మాయిని చేసుకొని అక్కడ ఉంచుదామనుకున్నా. నీకు వండిపెట్టవచ్చునుకదా అని" అన్నాడుట. ఈతడు నెత్తినోరు బాదుకుంటూవచ్చి వారిని కాళ్లుపట్టుకుని బతిమలాడుట క్షమించమని. వాళ్లు 'నయమే ముందే తెలిసింద'ని సంతోషించారు. వండిపెట్టడానికి ఒక భార్య, తనతో షికార్లు తిరగడానికి ఒక భార్య! ఒక చదువుకున్న భార్య, ఒక చదువుకోని భార్య! ఇలా ప్రతీ పురుషుడూ ఇద్దరు స్త్రీలను కట్టుకుంటే ఆడపిల్లల వివాహ సమస్య తేలికవుతుంది! ఒకామె ఉద్యోగం చేస్తుంది. ఒకామె వంట చేస్తుంది.

ఇలాంటి మనస్తత్వాలుగల వ్యక్తుల నేమనాలి? వండిపెట్టడానికి చేసుకుంటాడుట. అదైనా తనతండ్రికి. ఆ అమ్మాయికికూడ వ్యక్తిత్వముంది, భావాలున్నాయి అనేమాట మరచిపోయి ప్రవర్తించడం. ఇంక ఈ అమ్మాయి తండ్రికి వారిమీద పగతీర్చుకోవాలని. ఎవరినైనా సరే, ఎంత కట్నమైనా సరే, ఇల్లమ్మి, ఆస్తిఅంతా యిచ్చైనా సరే ఆ ముహూర్తానికే పెళ్లి చేసితీరాలని. అంతే కాని ఆ అమ్మాయి మనసెలా ఉంటుందో, అదెంత అవమానమో ఊహించడా తండ్రి.

ఈలా ఉన్నాయి నేటి స్వయంవరాలు. నేటి వివాహాలు పూర్తిగా తల్లిదండ్రుల ఇష్టప్రకారం కాదు; వధూవరుల ఇష్టప్రకారం కాదు. తల్లిదండ్రుల ఇష్టప్రకారం చేయడానికి చిన్నపిల్లలు కారు వధూవరులు. పోనీ వారికి పూర్తిగా స్వేచ్ఛనీయడానికి అనువైన సమాజం కాదు మనది. అటు పూర్తిగా ప్రాచీన హైందవ సాంప్రదాయమూ కాదు; ఇటు పూర్తిగా నవీన పద్ధతులూ కావు. తలిదండ్రులు పెళ్ళికుదురుస్తారు. అన్నీ సిద్ధంచేసి అమ్మాయిదగ్గర కొచ్చి ఆఖరిగడియలో 'నీ కిష్టమేకదూ' అంటారు. ఏమి చెప్తుందప్పుడు? ఒకవేళ చెప్పినా వారి కుటుంబ గౌరవం, వంశ ప్రతిష్ఠలూ గుర్తుకుతెస్తారు. అలాంటప్పుడు ఒప్పుకోనక తప్పుతుందా ఎవరికైనా!

మరొక సంగతేమంటే, కొందరు తండ్రులు 'మా అమ్మాయిలు చదువుకుంటున్నార'ని గర్వపడతారు. ఇలాగే ఒకాయన తన కూతురిని బి. యస్. సి. చదివించానని గొప్పగా ఒక పెళ్ళికొడుకుతో





అంటే, అతి నన్నాడుట "నాకోసం చదివించారేమిటి మీ అమ్మాయిని? ఏనా నాకు పని నేర్పిన అమ్మాయి కావాలిగాని ఆ బి. యస్. సి. డిగ్రీ ఇంట్లో ఏమీ ఉపయోగించదు" అన్నాడుట. అది నిజమే. తల్లిదండ్రులలో మార్పు రావాలి. అందంగా అమ్మాయి ఉండాలని అత్తగారు, ఎక్కువ కట్నమివ్వాలి అని మామగారు అనుకోకూడదు. ఇలా కాకుండా ఎవరి తాహతును బట్టి వారు సంచరించాలి. వియ్యము, నెయ్యము, కయ్యము సమాన హోదాలో ఉన్నవారితో జరపాలి. లేని గొప్పలకు పోయి, ఆశపడి, ఇల్లమ్మి, వాకిల్లమ్మి పెళ్లి చేసే కన్న మానెయ్యడమే ఉత్తమం.

ఇంకో వింత! ఒక కాలేజి ప్రొఫెసరు అన్నారుట - కాలేజి విద్య నేర్చిన స్త్రీలకి స్త్రీత్వముండదుట! పురుషుల్లా తయారవుతారుట! అందుచేత ఆయన నాల్గవ ఫారం చదివిన అమ్మాయిని చేసుకున్నారు. అమ్మాయి చదువుకోకూడదు. పుట్టింట్లో ఉండకూడదు. స్నేహితులింట్లకి వెళ్లకూడదు. సినిమాలు చూడకూడదు. తల్లిదండ్రులు కాళ్ళకడిగి కన్యనిచ్చేటప్పుడు, 'మా అమ్మాయిమీద మాకిక ఎటువంటి హక్కులూ లేవ'ని ధారపోయాలిట. ఎంత విశాల దృక్పథం! ఎంత విశాలభావాలు! ఈ అమ్మాయి పుట్టింటికి నడి తేయారిపోతుంది.

ఇలా ఉన్నాయి నేటి పరిస్థితులు, నేటి సమాజం. మన సమాజం బాగుపడాలంటే యువకులలో, యువతులలో, తల్లిదండ్రులలో మార్పు రావాలి. మనము పూర్తిగా పాశ్చాత్య సంస్కారం కలవాళ్ళము కాము; సనాతనాచారాలకు కట్టుబడ్డ వాళ్ళమూ కాము. అందుచేత మన యువతీ యువకుల్లో మార్పు రావాలి. భావాలు మారాలి. ఏవో పెద్ద ఆశలుకూడవు. చేతనైతే తల్లిదండ్రులకు సంఘానికి వెరవక, కత్తికి కలానికి, జంకక, కులభేదాలకి మతభేదాలకి తావివ్వక, ఆదర్శాలకి కట్టుబడి, సంఘ సంస్కరణాభిలాషులై విప్లవం లేవదీయాలి. లేదా, నిశ్చబ్దమైన, నిర్మలమైన వాతావరణంలో, పెరుగుతూ భారతీయ శిష్టాచార సంప్రదాయానుసారం జీవించాలి.

ఈ మధ్యవచ్చిన ప్రత్యేక వివాహాల బిల్లులో 21 సంవత్సరాలు దాటితేగాని పెళ్లిళ్లు చేసుకోరాదని ఉంది. మన కేంద్ర ఆరోగ్యశాఖామంత్రిణి 21 దాటితేగాని వివాహ మొద్దన్నది. ఆమె ఇది ఎందుకన్నా రంటే జనాభా తరిగట్టడానికి! ('మాల్తూషియన్ థియరీ' ప్రకారం జనాభా తరిగట్టడానికి రెండుమార్గాలున్నాయి. అందులో ఒక పద్ధతిలో ఆలస్యంగా పెళ్లిచేసికోడం కూడా ఉంది) ఇదిగాక ప్రజాప్రభుత్వంలో 21 దాటినవారంతా వయోజనులే. ఓటింగుహక్కుంది వారికి. అందుచేతవారికి యుక్తాయుక్త వివేచనాశక్తి అలవడి ఉంటుంది. ఇలా మన భారతరాజ్యాంగ చక్రాన్ని తిప్పడానికి సమర్థులైన అసమర్థులైనవారిని ఆలోచించి రథచోదకుల నెన్నుకోడంలోనే సందిగ్ధావస్థలో పడుతూంటే, తమ జీవితంలో భాగస్థులను ఎన్నుకోడానికి వీరెంత ఆలోచించాలో ఎవరు ఊహించగలరు? వీరిలో కొన్ని ఆశలు ఉంటాయి. కొన్ని కోరికలుంటాయి.

అందుచేత మన సమాజంలో కొన్ని పద్ధతులు పనికిరావు. ప్రేమ వివాహాలు కావు లేదు. ముందు ఇంటర్వ్యూలు, ఉంగరాలు మార్చడాలు, ఫోటోలు ఎక్స్చేంజ్ చేయడాలు, ఆతరువాత మాట తప్పలేదని పొమ్మనడం సామాన్యమై పోయింది—పెళ్లికి విలువలేదు. పైగా కీ మనసంఘంలో తక్కువైనది. హిందూసంఘంలో 'పెళ్లి'కి ఒక ఆశయముంది. అందుకే ఆ మంత్రతంత్రాలన్నీ. ఇది ఒకనాటితో పోయేది కాదు. 'యదిదం హృదయమ్ తవ తదస్తు హృదయమమ' నీహృదయమే నాహృదయము, నా హృదయమే నీ హృదయము అని అనిపిస్తారు పెళ్లిసమయంలో. అటువంటి పవిత్ర మంత్రోచ్ఛారణను పూర్తిగా అర్థం చేసికొని అనుసరించలేకపోయిన వ్యక్తికి, కొంతవరకైనా ఒకరినొకరు అర్థం చేసికొని ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా సంసారాన్ని సాఫీగా నడుప ప్రయత్నించాలి. ★







వనితాలోకం సీరియల్



# స్వయంసిద్ధ



## 12

వివాహంనాటి రాత్రి మాట్లాడుకున్నాక - మళ్ళీ ఈ విచిత్ర దంపతులు కలుసుకుని మాట్లాడుకునే అవకాశం రాలేదు. ఆ అవకాశం మళ్ళీ పూలపాన్పు నాటిరాత్రి లభించింది.

అంతఃపురంలో గోవిందుడి తల్లి నివసించిన భాగం నవవధువుకోసం యజమాని ఆదేశించిన పద్ధతిని అలంకరింపబడింది. మాధురీదేవి తొలిసారిగా ఈ అంతఃపురంలో అడుగు పెట్టినప్పుడు ఈ భాగంలో కొద్ది రోజులు మాత్రం ఉంది. లోకాంతరగతురాలైన తన సవతి స్మృతిని భర్త హృదయంలోంచి చెరిపెయ్యటానికి - ఆమె పట్టుపట్టి, అంతఃపురంలో మరోవైపును ఆధునిక పద్ధతిని ఓ ప్రత్యేక భవనంగా తయారు చేయించుకుంది.

నాడు కోమండా పాడుపెట్టిన భవనం - మళ్ళీ ఇప్పుడు బాగుచేయించబడి - చక్కని దీపాలతో కళకళలాడుతూ నూతన దంపతులకు అభ్యుదయాన్ని చేకూర్చేదిలా ఉంది. తనకు కేటాయించిన ఈ భవనంలోని ఏర్పాట్లన్నీ చూసి తండి చాలా తృప్తి పడింది. శయన గృహంలో అమర్చబడిన మంచం, దానిమీద పరుపు, తలగడలూ, దుప్పట్లూ అన్నీ చాలా చక్కగా ఉన్నాయి. ఆ పక్కమీద ఒత్తుగా పూలు చల్లిఉన్నాయి. గదిలో క్రింద విలువైన పారశీకపు తివాచీలు పరచబడ్డాయి. గోడల్నీ చక్కని చిత్రపటాలున్నాయి. మంచాని కెదురుగా గోడని చిరునవ్వులొలికిస లాడుతున్న ఓ సుందరాంగి తైలచిత్తరువుంది. మధ్యలో నుంచుని చూస్తే - ఆ చిత్తరువులోని స్త్రీ మధుర మందహాసంతో అభ్యాగతులను ఆహ్వానిస్తోందా అనిపిస్తుంది. ఎక్కడా దొరకని రకరకాల పుష్పాలతో ఈ పడకగది చక్కగా అలంకరింపబడి ఉంది. కింద పరిచిఉన్న తివాసీలమీద అక్కడక్కడ చిన్న చిన్న వెండి పూల తొట్లలో పూగుత్తులు అమర్చబడ్డాయి.

శయనమందిరం ప్రక్కనే పుస్తకాగారం. పెద్ద పెద్ద బీరువాలనిండా రకరకాల పుస్తకాలు...మధ్యనోక మేజా, చుట్టూ కుర్చీలూ. దాని ప్రక్కనే డ్రాయింగ్ రూమ్. ఆ గది సోఫాలతో అలంకరింపబడింది. దాని కలువైపున టాయిలెట్ రూమ్. రకరకాల విలాసవస్తువులతో - సువాసన ద్రవ్యాలతో గదంతా పరిమళిస్తూ ఉంటుంది. దీని ప్రక్కనే దంపతుల భోజనశాల...ఆ డాబామీద చక్కగా అమర్చిన పూలకుండీలు క్రింద మనోహరమైన ఉద్యానవనం.

రాజాంతఃపురాల్లో - ఎవరికి వారికి ప్రత్యేకమైన భవనాలుంటాయని నవలల్లో చదివింది దండి. ఇక్కడికి వచ్చాక కథల్లో విషయాలు కూడా యథార్థాలై ఉండొచ్చునని తోచిందామెకి. చక్కగా ముస్తాబయిన దంపతులతో పాటు చాలామంది స్త్రీలు చేరారా పడకగదిలో. అక్కడ ఆచారం ప్రకారం జరగవలసిన తంతులంతా ముగిసినా వాళ్ళెక్కడా ఇంకా కదిలే ధోరణిలో ఉన్నట్లు కన్పడలేదు. తనువు ముఖంలో రవంత చికాకు వ్యక్తం అవుతున్నా దాన్ని వీళ్ళెవరూ గమనించి వెళ్లలేదు. తనువు మాటలెన్నో వీరు గుడ్లప్పగించి, చెవులు దొరగించుకుని విస్తుపోతూ విన్నారు. కాని ఆమె వరుసలో ఎలా మాట్లాడుతుందో ఇంతవరకు ఎవరూ వినలేదు. అంచేత అది విని, ఆ మనసులని [illegible] కూడా తీర్చుకోటానికి అందరూ సర్ధి తీర్చి కూచున్నారు. ఈ యింట్లో ఏం జరిగినా ముందడుగు వేస్తూ ఉండేది మృణాలినే. ఆమె ఆమాట కొస్తా ముఖానే అనేసింది. "ఇవా మీరిద్దరూ రెండుమాటలు మాట్లాడుకుంటే విని వెళ్లిపోతాం మేము. ఈ ఉత్సవంకూడా మధురంగా సమాప్తమయినట్లవుతుంది" అన్నది మృణాలిని...

తనువు సమాధాన మేమీ చెప్పలేదు. కాని ఈ యింట్లో ఎవరేం మాట్లాడినా - వాళ్లయెదుట ఎన్నడూ జవాబు చెప్పి యెరగనివాడు - ఆ నిరీహుడు, ఆ 'జడభరతుడు' నవ్వుతూ మాట్లాడేశాడు. "అయితే మీకింకా తెలియదన్నమాట! ఆనాటి రాత్రే మేం ఎన్నెన్ని సంగతులు మాట్లాడుకున్నామని! అబ్బో! చాలా చాలా మాట్లాడుకున్నాం. తెల్లవార్లూ అలాగే కూర్చుని ఎన్నెన్ని మంచి మంచి కథలు—"

గోవిందు డలా మాట్లాడుతుంటే అందరి ముఖాల్లోనూ చటుక్కున మెరపు తీగలాంటి నవ్వు మెరిసింది. మృణాలిని కూడా ముఖం పక్కకు తిప్పుకుని, నవ్వుకుని, "ఏమిటంటున్నావు వెంగళప్ప బావా? అన్ని సంగతులు మాట్లాడుకున్నారా ఆరోజునరాత్రి? కథలు కూడానా? ఓయబ్బో...!" అంది.

గోవిందుడి ముఖమూ - కళ్ళూ ఉత్సాహంతో మెరిసిపోయాయి. ఎంతో ఉత్సాహంతో "ఆ కథలు విన్నారంటే మీరంతా వెర్రిమొహాలేసుకు చూడాల్సిందే! వాటన్నిటిలోకి భలే కథ—ఆ రాజకూతురు విద్యావతి కథ—అది యెంత బావుందని! ఓహ్!" అన్నాడు.

మృణాలిని పరిహాసంగా—"ఆ కథ చెప్పిం దెవరు బావా? ఆవిడా?" నువ్వా?"

---

మూలం: మణిలాల్ వంద్యోపాధ్యాయ అనువాదం: మదిపట్ల సూరి



గోవిందుడు సగర్వంగా "ఆ-వి-డే" అన్నాడు.

ఇంతసేపటికిప్పుడు ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. వధువు అసహిష్ణుభావంతో భర్తకేసి పదేపదే సాభిప్రాయంగా చూసింది. కాని ఆ మాటల ఉత్సాహంలో అతడు భార్య ముఖంకేసి చూసే అవకాశాన్ని కల్పించుకోలేదు. చూపులు కలియగానే వధువు చూపుల చురుకుతనానికి అతడి ఉత్సాహమంతా ఉఫ్‌న ఎగిరి చక్కాపోయింది. మరుక్షణంలోనే అతను గొంతు తగ్గించుకుని, "బాబోయ్! నువ్వు కూడా చూపుల్తో బెదరగొడుతున్నావ్?" అన్నాడు జాలిగా...

గోవిందుని మాటలకు అక్కడున్న స్త్రీలంతా గొల్లున నవ్వారు. మృణాళిని వధువుకేసి చూసి, "అయితే పెళ్ళినాటి రాత్రే మా పెద్దబావ తెలివితేటలు ఎంతలో ఉన్నదీ పట్టి చూశావన్న మాట!" అన్నది.

చండి ఆమె అడిగినదానికి తగినట్లు కొంచెం సూటిపోటిగా - "ఇంత గొప్ప విషయం నీబుద్ధికేలా తట్టిందో తెలియకుండా ఉంది!" అన్నది.

ఆమాట కొంచెం గ్రుచ్చినట్లున్నా మృణాళిని ఆ భావాన్ని బయటపడకుండా- మామూలుగా మాట్లాడుతున్న భంగిమలోనే "ఆమాటల ధోరణే చెపుతోందిగా! మామూలుగా ఎప్పుడూ ఎంత గిల్లినా మాట్లాడకుండా స్తబ్ధులా ఉండేవాడు - ఇవాళ తనకి తానై కల్పించుకుని మాట్లాడుతున్నాడు. ఇది నీచేతి చలవో, నీ స్పర్శ ప్రభావమో అంతుపట్టకుండా ఉంది" అన్నది.

చండి చిరునవ్వు నవ్వి, "మీ బావను మీరంతా కలిసి బుద్ధిపూర్వకంగా ఏ మాయదండంతోనో స్పృశించి నిద్దరోయేట్లు చేశారుగా! తర్వాత హఠాత్తుగా ఓ శుభలగ్నాన ఏ స్వర్ణదండం స్పర్శవల్లనో ఆ నిద్రమత్తు వదిలిపోయిందనుకో. అందులో నా తప్పు ఏముంది?" అన్నది.

చండిమాటలు ఒక్కక్షణం అందర్నీ విస్తుపోయేట్లు చేశాయి. మృణాళిని ఆ మాటా ఈమాటా అని చండిని చిన్నబుచ్చుదామని వచ్చిందసలు. కాని తనకే దెబ్బమీద దెబ్బ తగలటంతో ఆమెలో కాఠిన్యం కరడుకట్టసాగింది. ఇంతమంది స్త్రీలయెదుట ఆమె తెల్లబోతుందా! అంచేత ఈసారి నోటికొచ్చిన మాటేదో గట్టిగానే అనేసింది: "తప్పుపట్టటం కాదిది, ఘనతను కట్టిపెట్టటమే! అకటావికటపు రాజుకు - అవ్యక్తపు ప్రధానిట!" కాని మా అకటావికటపు బావకి దొరికింది మాత్రం స్పర్శవేదిలాంటి పెళ్ళాం.

వధువు నవ్వుతూ - "ఇంకమీదట నిజంగానే అనుకోని సంఘటనలు జరిగితే అందుకు నన్నుమాత్రం తప్పుపట్టొద్దు" అన్నది. మృణాళిని కీసారి సమాధానమేమీ తోచలేదు. ఆమె తరఫున బయటినుంచి వచ్చింది సమాధానం. "మెదలకుండా ఊరుకున్నావేం మీనా? చెప్పలేకపోయావా? 'అలాంటి భయం ఇక్కడేం లేదు - నాటువైద్యుడి కూతురు ఏం చేస్తుంది మహా చేస్తే మందులేవయినా పెట్టి మనస్సు విరుస్తుందేమో అని'...!"

బయటికి చూసి అందరూ విస్మితులయినారు. నివారణుడు గుమ్మంలో నుంచుని ఉన్నాడు. అక్కడున్న స్త్రీలు కంగారుగా అవగుంఠనాలు సవరించుకున్నారు. చిన్నబోయిన మృణాళిని ముఖం ఉత్సాహంతో ఉజ్వలమైంది. ఆమె నివారణుడన్న మాటకు వత్తాసుయిస్తూ "మా చిన్నబావ అన్నమాట రైటే. జమీందారుల యింటి ఆడపడుచవే అయినట్లయితే నువ్వామాట అన్నా ఒప్పుతుంది" అన్నది.

చండి కంఠస్వరానికి అక్కడున్న వాళ్ళంతా చకితులయినారీసారి. ఆమె రోషంగా "మనమూ మనం మాట్లాడుకుంటున్న ఈ ప్రసంగంలోకి తండ్రుల్నీ తాతల్నీ తీసుకురావల్సిన అవసరంలేదు చెల్లీ!" అన్నది.

ముఖం కందగడ్డలా చేసుకుని మృణాళిని నివారణుడికేసి చూసింది. వాళ్ళిద్దరి కళ్ళూ ఏం మాట్లాడుకున్నాయో యేమో, మరుక్షణంలో ఆమె నిర్లక్ష్యంగా "తక్కువ వంశంలో పుట్టి, పెద్ద పెద్ద మాటలు మాట్లాడితే వంశాన్ని గురించి ఏదో ఓమాట అనక మానరు. తండ్రి చేతులు చూసి ఏవో రెండు మిరియాల మాత్రలిచ్చేవాడయినప్పుడు - కూతురు పెద్ద మాటలు మాట్లాట్టం ఒప్పదు" అన్నది.

ఆ మేనత్త మేనమామ బిడ్డల మర్యాద తెలియని ప్రవర్తనకి, కటువైన మాటలకి చండి చూపులు నిప్పులు క్రక్కాయి. ఆమె మృణాళిని ముఖంమీద చూపులు నిలిపి, తాను అనే మాటలు నిష్కర్షగా అనేసింది. "మా నాన్న మాత్రలు అమ్ముకుని బ్రతికేవాడన్నమాట అక్షరాలా నిజమే. కాని అప్పుల్లో మునగటంవల్ల కూతుర్ని అమ్ముకుని ఆయన వంశ గౌరవానికి భంగం కలిగించలేదు. ఆ దృష్టితో చూస్తే అడుగులొత్తయిన పెద్ద గంగాళం కన్న నీళ్లు నిలిచే చిన్నకుండ ఉత్తమమైనది కాదూ?"

తానెంత రూఢంగా మాట్లాడినా, వధువు జవాబుతో ఇంత తీవ్రంగా ఆఘాతపరిచి, తనని తల వొంచుకునేట్లు చేస్తుంది అని మృణాళిని అనుకోలేదు. ఈ ఇంటికి వచ్చిన ఈ రెండు రోజుల్లోనే - ఈ వంశపు గుట్టు అంతా ఆమె తెలుసుకుందనికూడా తెలియదామెకి. ఆమె వివర్ణముఖాన్ని పైకెత్తి నివారణుడికేసి నిస్సహాయురాలిలాగా చూసింది.

నివారణుడు ఇవాళ ఏమయినాసరే చండి తత్వం అసలెలాంటిదో తేల్చుకుందామనే లెక్కలోనే వచ్చాడు. ఆమె పితృవంశాన్ని, వారి వృత్తిని ఎత్తిపొడిచి, ఆమెని విస్తుపోయేట్లుచేసి, తనకి మొదటిరోజున చేసిన అవమానానికి ప్రతీకారం చెయ్యాలనే కసితో వచ్చాడతను. కాని ఆ మాటమీద ఆమాటమీద తండ్రి ప్రసక్తి రాగానే- దానికి బదులుగా వధువు ప్రయోగించిన బాణం - దానికి లక్ష్యస్థానం ఏదైనదీ మృణాళినితోపాటు నివారణుడు కూడా త్రుటిలోనే గ్రహించాడు. మృణాళిని తెల్లబోయి నివారణుడికేసి గుడ్లప్పగించి చూడసాగింది. కాని వధువు కనపరిచిన స్పర్ధతో అతడి ధైర్యం దిగజారిపోయింది.

"నువ్వు యింత నిర్లక్ష్యంగా అన్నమాట ఎవరికి తగిలేదీ తెలిసే అన్నావా?" అని గర్జించాడతడు.

చండి ముఖం ప్రక్కకి తిప్పుకోని, ఏ మాత్రం తొణక్కుండా "నేను ఎవర్నీ పేరెత్తికాని, ఎవర్నీ కించపరచాలనే ఉద్దేశంతోకాని అనలేదా మాట: కాని ఘరానావంశం ఘరానా వంశం అని గొంతుచించుకునే వారికి మాత్రం నేను చెప్పదలచిందిది - దీపం అడుగునే చీకటుంటుంది. ఘరానా వంశీయులే అనేక సందర్భాల్లో కూడని పనులు చేసి నలుగురినోళ్ళలోనూ పడతారు. కనుక వంశాన్ని గురించి గొప్పలు చెప్పుకోటం చాలా పెద్ద పొరపాటు అంటున్నాను" అన్నది.

చండి మాటలు నివారణుడికి మరింత తిక్క ఎత్తించాయి. అతడీసారి గుడ్లెర్రజేసి, తర్జనితో బెదిరిస్తూ "నువ్వు అన్న మాటను కప్పిపుచ్చుకోచూస్తున్నావు కాని, నీ ఆట ఇక్కడ సాగదు. నేను చెపుతున్నాను. నువ్వు మా మాతామహుణ్ణి కించ

(30-వ పేజీ చూడండి)



# విజయవాడ

జయవాడ పట్టణం —ఫొటో: వై. ఆర్. కృష్ణమూర్తి.

దుర్గకొండనుండి విజయవాడ —ఫొటో: గోవాడ సత్యారావు.





దుర్గ గుడి —ఫొటో : టి. బాలసత్యనారాయణ.

కృష్ణానది ఆనకట్ట —ఫొటో : వై. ఆర్. కృష్ణమూర్తి.

# ★ స్వయంసిద్ధ ★

పరచటానికే అన్నా వీ మాట. అన్నావా? లేదా? ఆఁ? అనలా?" అని ఉరిమాడు.

నివారణుడి ఉరుములకు స్త్రీలంతా భయపడి చండీ ముఖంకేసి చూశారు. ఆమె ముఖంలోమాత్రం భయచిహ్నాలేవీ కన్పించలేదు. ఆమె క్రితంసారిలాగానే ఈసారికూడా అవిచలితకంఠంతో—ఇంకొంచెం నిష్కర్షగా—"నేను మీ మాతామహుని పేరెత్తి ఏమీ అనలేదు. ఆయన పేరెత్తింది మీరే కాని ఇప్పుడు చెపుతున్నాను. ఆయన నిజంగానే అలాంటి పనిచేసి వున్నట్లయితే - ఆయన మనుమరాళ్ళూ మనుమలు అందుకు నిజంగా సిగ్గుపడటం భావ్యం" అన్నది.

"ఏమిటి? నువ్వు మా తాతగారు చేసిన పనికి తప్పులు ఎంచేపాటిదానివా?"

"మా నాన్న చేసే వృత్తి సంగతి తీసుకొచ్చి ఆయన్ని కించపరిచే అధికారం మీ కెవరిచ్చారు? అని నేనూ అడిగితే?"

"మీ నాన్న మాసంస్థానంలోని ప్రజల్లో ఒకడు. అతడ్ని గురించి విమర్శించే అధికారం కచ్చితంగా ఉంది మాకు."

"అయితే నా సమాధానంకూడా వినండి. 'నేనూ తగుదు'నంటూ రాజవేషం వేసుకుని వచ్చేవాళ్లుచేసే అన్యాయాల్ని ఖండించటానికి నాకూ హక్కుంది..."

ఇంతలో మృణాళిని నివారణుడ్ని చెయ్యిపట్టుకుని గట్టిగా లాగుతూ "ఊరుకో బావా! ఇంక రగడ పెంచి లాభంలేదు. ఈ విడతో మాట్లాడి నెగ్గలేవు నువ్వు" అని మొత్తుకుంది.

నివారణుడు కోపంతో ఊడికిపోతున్నాడు. వధువుకి ఘాటైన సమాధానం చెపుదామనుకుంటే అతడి మాటల తూణీరం ఖాళీ అయింది. అంచేత అతడా మాటల బాటలోంచి కొంచెం పెడతిరిగి "నీకింత అహంకారమయితే సహించి ఊరుకోము మేము. ఆరోజూనా ఇలాగే నన్ను అందరి యెదుటా గాడిదన్నావు" అన్నాడు.

చండి మెదలకుండా ఊరుకుంది. ఈ మాటకు సమాధానం ఏమీ చెప్పలేదు. కాని ఆ గదిలో ఉన్నవారి నందర్నీ చకితుల్ని చేస్తూ ఆమాటకు గోవిందుడు సమాధానం ఇచ్చాడు. "గాడిద అని ఎందుకు అనకూడదా? అన్నని పట్టుకుని వెంగళప్పని అల్లరి పెట్టినవాడివి, వదినగారి మేలిముసుగు పట్టుకుని లాగబోయినవాడివి, బిగ్గరగా కేకలు పెడుతూ ఇక్కడచేరిన [illegible] చెవులు చిల్లులుపడేట్లు చేస్తున్నవాడివి - నువ్వు గాడిదవికాక ఎవరివి మరి?"

చండి ఉజ్వలదృష్టితో భర్తముఖంకేసి చూసింది. నివారణుడు - మృణాళిని మళ్లీ ఒకరిమొహాలొకరు చూసుకున్నారు. "నోరూ వాయీలేని పిచ్చాడుకూడా చిలకపలుకులు పలకటం నేర్చుకున్నాడల్లే ఉందే. చచ్చాం. నోరు మహా వడిగా లేస్తోందీ! నెత్తిన పసుపుగింజలు పడ్డప్పటినుంచీ వీపున బెత్తం పడటంలేదుగా! ఈ విసురంతా అందుకనేనల్లే ఉంది:" అన్నాడు నివారణుడు ఎకసక్కెంగా.

గోవిందుడి నోటితాళం ఊడిం దివాళ. నివారణుడి మాటలకు ఇవాళ వెంటనే నిర్భయంగా జవాబిచ్చాడు. "నిన్ను గాడిద అనటంలో తప్పేమీలేదు. ఇంతమంది ఆడవాళ్లమధ్య నిలబడి నువ్వే చెప్పావుగా 'అన్ననికొట్టే ఘనుడి'నని! నువ్వు గాడిదవే! కచ్చితంగా గాడిదవే! 'గాడిదతల' బుట్టబొమ్మ ఒకటి నీ మొహానికి తగిలిస్తే నీకు తగిఉంటుం దనిపిస్తోంది. మేమంతా నీ వెనకాల 'గాడిద గాడిదా' అంటూ చప్పట్లు చరుస్తూ గోలచేస్తాం."

చండి గోవిందుడి ముఖంకేసి తీవ్రంగా చూసింది. మళ్లీ భార్యాభర్తలిద్దరిచూపులు కలియగానే గోవిందుడి ఉత్సాహం కాస్తా దిగజారిపోయింది. తాను కూడా గాడిదలాగా అరుస్తూ తప్పుచేశానుకాబోలనిపించిం దతడికి. మనస్సులోని ఉత్సాహాన్ని అణచుకుని, చటుక్కున మాట్లాడటంకూడా ఆపేశాడు.

కాని నివారణుడి ఉత్సాహం మాత్రం రెచ్చిపోయింది. ఇప్పటివరకూ అతడు అన్నగారిని కానిస్తూనే వచ్చాడు. అలాంటివాడివాళ పెళ్ళాం కొంగు పట్టుకుని వేలాడుతూ అందరియెదుటా హేళనచేస్తాడా! అతడి కళ్లు రెండూ అహంకారాన్ని చిందుతున్నాయి. వధువుమీద అతడికి వచ్చిన కోపమంతా గోవిందుడిమీద చూపిస్తూ "ఇవాళ నీ చెవులు రెండూ మెలిపెట్టి ఈగదిలోనే నీమీద ఎక్కి కూడుని స్వారీ చేస్తా రాస్కెల్ ఏమనుకున్నావో!" అన్నాడు.

అతడిమాటలకి చండికి ఒళ్లు మండిపోయింది. కాని ఆ కోపమంతా వెళ్లగక్కకుండా, పైకి [illegible]—"స్వారీ చెయ్యటానికి సరియైన చోటు మైదానం—ఇది మైదానం కాదన్న సంగతి గుర్తుంచుకోండి. ఇక్కడికి వచ్చిన గౌరవనీయులైన గృహిణులంతా—మీ ప్రవర్తనచూసి కళవళపడుతున్నారు. సభ్యత, మర్యాద నేర్చుకుని కాని స్త్రీలతో మాట్లాడకూడదన్న వివేచనయినా లేదు మీకు" అన్నది.

నివారణుడు ముఖం మాడ్చుకుని, "నువ్వు ఆడదానివి, పెళ్లికూతురివి అయిపోయావు కాని లేకపోతేనా?—" అంటూ రంకెలు వెయ్యసాగాడు. ఆమె కంఠస్వరాన్ని పరశంగా మార్చుకుని, పరిహాసధోరణిలో—"ఏంచేస్తావ్? నావీపుమీదకూడా బెత్తాలు విరగకొట్టే వాడివనుకుంటా. ఆరోజున నిన్ను 'గాడిద'అని అన్నాను కాని, ఇవాళ నీప్రవర్తనచూస్తే నిన్ను అలా అనటం గాడిదనుకూడా అవమానపరచటమే అనిపిస్తోంది" అన్నది.

ఇంతలో మృణాళిని విసుపుగొంతుతో "ఏమిటి బావా! నువ్విక్కడ ఇలాగే నిలబడి ఆమె మాటలన్నిటినీ సహిస్తావా? ఇంక నిన్నిక్కడ ఒక్కక్షణం ఉండనివ్వను — ఏమయినాసరే ... ఊఁ. పద. వెళ్లు ఇక్కడినుంచి ..." అంటూ విలవిలలాడింది. నివారణుడు వధువుకేసి తీక్ష్ణంగా చూస్తూ "నీకిదంతా ఏం చూసుకున్న అహంకారమో — తెలిసిపోయింది. కాని నేను చెపుతున్నా - నీ గర్వం అణచితీరుతాను. ఇప్పుడింత కొమ్మెక్కి కూచున్నదానివి రేపే వచ్చి కాళ్ళమీద పడతావ్. ఆఁ. ఇక్కడెవరెవరున్నారో వాళ్లందరి పేర్లూ నువ్వు రాసుకో మీనా! వీళ్ళంతా నాన్నగారిదగ్గిర సాక్ష్యం ఇవ్వాలి" అన్నాడు.

చండి నవ్వుతూ ద్వారంకేసి చూస్తూ "ముల్లా పరుగు మసీదుదాకానే! కాని మీ బావకి ఈ సలహా ముందే యెందుకిచ్చావు కాదు మృణాళినీ!" అన్నది.

మృణాళిని ముఖం ముడుచుకుని, "ముల్లాని యెరుగను ఆ మసీదుని యెరగను. కాని తొందరపడకు. రేపు కళ్లనీళ్ళతో కాళ్ళపారాణి కరిగిపోతుంటే అప్పుడు తెలిసివస్తుంది" అన్నది.

చండి చప్పునవచ్చి ఒక చెయ్యి మృణాళిని బుజంమీదవేసి, రెండో చేత్తో ఆమె నోరు మూస్తూ పరిహాసధోరణిలోనే—"కాస్త దయఉంచి నోరు జారకమ్మా! నోరు జారకు. ఇవాళ మా పూలపానుపు రాత్రి. పరిహాసాలు తప్ప మరోకమాట అనటం పాపం! కనుక కొంచెం సావధానంగా ఉండు" అన్నది.



మృణాళిని శరీరమంతా కొయ్యబారిపోయింది. మెడ అటూ యిటూ తిప్పలేకపోయింది. నోట్లోంచి మాట పెకల్చుకోలేకపోయింది. విద్యుత్ స్పర్శ సోకినట్లు మొహం వేలవేసుకుని చండికేసి చూడసాగింది. ఒక్క నిమిషం అయాక చండి ఆమె భుజంమీదినుంచి చెయ్యితీసేసి, ఆమెకి విముక్తి కలిగించింది. తర్వాత అక్కడి స్త్రీలకేసి చూస్తూ "మీరు ఆఫీసుతో వెళ్ళి మీ పేర్లు ఇవ్వండి. రేపు మీ కందరికీ సమనులొస్తాయి" అన్నది.

ఆ స్త్రీలలో ఒకామె "మేమంతా మా పక్షమే కావాలంటే ఇప్పుడే వీరినందర్ని కదిలించి చూడండి" అన్నది.

"మరిది మిమ్మల్నందర్నీ సాక్ష్యం వేసు

 

# స్వయంసిద్ధ



ఉంటానని చెప్పివెళ్ళాడు, వినలేదూ? మీరు అతడి తరఫునే సాక్ష్యం ఇవ్వండి. నా సాక్ష్యం ఏదో నాకుంది" అన్నది చండి.

మృణాళిని ఇప్పటికీ గుక్కతిప్పుకుని - "ఈమె నా మెడమీద చెయ్యివేసింది. నా గోరు నొక్కేసింది. మీరంతా చూశారుగా! మీరంతా ఈ సంగతి జమీందారు గారిదగ్గర చెప్పాలి" అన్నది.

అక్కడి స్త్రీలంతా మనస్సుల్లో నొచ్చుకున్నారు. కొందరు "పూలపానుపు నాటి రాత్రి గదిలోకి వచ్చి ఇంత అసహ్యంగా ప్రవర్తించారేమిటి?" అంటూ అసహ్యించుకున్నారు.

స్త్రీలు రణగొణ ధ్వని చేసుకుంటూ మృణాళినితో సహా అందరూ వెళ్ళిపోయారు. చండి కిప్పటికి విముక్తి లభించింది.

## 13

అందరూ వెళ్ళిపోయిన ఒక క్షణానికి చండి కూడా ఆ గదిలోంచి బయటికి వచ్చింది. ఆ భవనం వాకిలిముందు ఇద్దరు పరిచారికలు కూచుని కూచునే కునికిపాట్లు పడుతున్నారు. ఈమెని చూడగానే వాళ్లు చటుక్కున లేచి నిలబడి "ఏమి కావాలి అమ్మగారూ?" అని అడిగారు.

"ఏమీ అక్కర్లేదు. ఇంక మీరుపోయి నిద్రపోండి" అన్నది చండి. వాళ్ళు విస్తుపోయి ఆమెకేసి చూస్తూ "రాత్రి ఒకవేళ ఏదైనా అవసరమొస్తే- మేము రాత్రి అంతా వంతుప్రకారం మేలుకుని ఉండాలి ఇక్కడ. ఒకరం కాసేపు నిద్రపోతే ఇంకొకరం మేల్కొంటాము" అన్నారు.

మీ రిలా రాత్రి తెల్లవార్లూ ఇక్కడ పడిఉండాల్సిన అవసరం లేదు. ఏదైనా అవసరంవస్తే అది నేనే సర్దుబాటు చేసుకోగలను. నేనేం అవిటిదాన్ని కాను. వెళ్లండి మీరు."

వాళ్లు తెల్లబోతూ అక్కడనుంచి వెళ్లిపోయారు. చండి స్వయంగా తలుపులు వేసేసి, తన గదిలోకి తిరిగివచ్చింది. గోవిందుడు మంచంమీద కూచుని ఉన్నాడు. వధువు మెల్లిగా అతడి ముంగటికివచ్చి, చిరునవ్వుతో అతడి ముఖంకేసి చూసింది. గోవిందు డిప్పటిదాకా - తా నివాళ ఇన్ని మాటలు మాట్లాడటం తప్పా - ఒప్పా అని ఆలోచిస్తూ కూచున్నాడు

చండి తనకేసి శాంతంగా చూడటంతో, ధైర్యంచేసి ఎలాగైనా ఆమెనడిగి తన సందేహం తీర్చుకోవాలని ఆదుర్దా పడసాగాడు. కొంచెం ముందుకు వంగి ఎంతో ఆసక్తితో — "నువ్వే చెప్పు — నే నివాళ ఇన్ని మాటలు మాట్లాడటం తప్పుచేసినట్లా- లేక మంచిపని చేసినట్లా?" అని అడిగాడు.

"మీరు చేసింది మంచి అవునో కాదో మీరే ఆలోచించుకుని తెలుసుకోలేరా?" అని గంభీరంగా జవాబు ఇచ్చింది చండి.

గోవిందుడు నిరుత్తరుడై చండిముఖం కేసి చూస్తూ ఊరుకున్నాడు. అతడిమ్లాన దృష్టిమాత్రం 'నేనా మాత్రం తెలుసుకో కలిగితే నిన్నెందుకు అడుగుతాను?' అన్న భావాన్ని వ్యక్తం చేస్తున్నట్లుంది.

వధువు భర్తముఖభంగిమకేసి ఓరగా చూస్తూ "పెళ్లినాటి రాత్రి సంగతి ఎవరు చెప్పమన్నారు మిమ్మల్ని? వచ్చిన పేరంటాళ్లంతా అలా వేళాకోళాలు పట్టిస్తున్నా మీరు గ్రహించలేదూ?" అని అడిగింది.

"ఓహో! అందుకేనా నువ్వు అప్పుడే కళ్లతో గద్దించావ్? కాని ఆమాటలు ఎవరితో చెప్పకూడదని నువ్వు నాతో చెప్పలేదుగా! నువ్వు ఆమాట చెప్పిఉన్నట్లయితే నేనసలు చెప్పేవాణ్ణే కాను. ఇంకెప్పుడూ చెప్పను."

"మనస్సులో ఉన్న విషయాలన్నీ పైకి చెప్పకూడదు. భార్యాభర్తలిద్దరూ చెప్పుకున్న మాటలు బయటవాళ్ళ చెవిని పడనీయకూడదు. ఇకనుంచి మీరు నేను చెప్పినమాటలు ఎవరితోనూ చెప్పకూడదు. మీ మనస్సులోనే దాచుకోవాలి. తెలిసిందా?"

"తెలిసింది - తెలిసింది. పెళ్లాం చెప్పిన మాటలు ఎవరికీ చెప్పకూడదు. అలా చెప్పటం తప్పు. ఇంక నేనెవ్వరికీ ఎప్పుడూ చెప్పను."

"వీలైనంతవరకు చెప్పకుండా ఉండటమే మంచిది. ఏదైనా చెప్పవలసివస్తే వెనకాముందూ ఆలోచించుకుని మరీ చెప్పాలి. ఇవాళ మీ రన్నమాటల్లో ఒక్కదానికి మాత్రం నాకు చాలా సంతోషం వేసింది."

"సంతోషమా? నిజమే? బాహ్: భలే!"

"కాని ఏంమాట అని అడగలేదేం?"

"చెప్పు - చెప్పు - నువ్వు మంచిదానివి- చెప్పు."

"మీ తమ్ముడు 'గాడిద' ప్రసక్తి తీసుకొచ్చినప్పుడు మీరు చెప్పిన జవాబు... భలే జవాబు చెప్పారు"

"చెప్పనూ! అప్పుడెంత కోపంవచ్చిందనీ నాకు!"

"అయితే మీకూ కోపం అనేది వస్తూ ఉంటుందన్నమాట!"

"ఇదివరకు వచ్చేదికాదు. కాని ఇప్పుడు వస్తోంది. నిన్నెవరైనా ఏమైనా అంటే ఇలాగే కోపంవస్తుంది. ఆ కోపంలో ఏం చేసేవాడినో తెలియదు నా కిప్పుడు. కాని నువ్వు మళ్ళీ కళ్ళెర్రచేసి చూశావుగా-"

"మీరు తెలివితక్కువ వాళ్లలాగా మరీ గొడవచెయ్యసాగారు. ఆడవాళ్ల ఎదుట అలా చప్పట్లు చరుస్తూ అరవటం మొదలెడితే మిమ్మల్నే తప్పుపడతారు."

"సరే అయితే ఇక నేనెప్పుడూ ఆడవాళ్ల ఎదుట బిగ్గరగా మాట్లాడను"

"ఇవాళ మన పూలపానుపు— తెలుసుగా?"

"అది కూడా తెలియదంటావా? ఇన్ని పూలూ - ఇంత హడావిడీ—"

"సరే కానీండి. ఈ పెద్ద ఫోటో ఎవరిది? మీ అమ్మగారిదా?"

"ఆఁ ఆఁ ఆవిడే మా అమ్మ"

"మీ కావిడ గుర్తు ఉన్నారా?"

"ఎలా గుర్తుంటుంది? మా అమ్మ చనిపోయేనాటికి నేను మరీ చిన్నవాణ్ణిగా"

"ఈ గదిలో ఉన్న ఫోటోలన్నిటికి ఇవాళ పూలదండ లేశారు. ఈ ఒక్క ఫోటోకి మాత్రం వెయ్యలేదు. ఎంచేత వెయ్యలేదో తెలుసా?"

"నాకేం తెలుసు? బహుశా మరిచిపోయారేమో!"

"కాని వాళ్ళు చేసిన పొరపాటును మనం చక్కదిద్దాలి. ఇంట్లో దండలకేం కొదువలేదివాళ. మీరు లేచి వెళ్ళి ఓ దండ తీసుకొచ్చి మీ అమ్మగారి ఫోటోకి మీరే స్వయంగా వెయ్యండి."

గోవిందుడు మంత్రముగ్ధుడిలాగా మంచం మీదినుంచి లేచాడు. ఇవాళ గదిలో ఎక్కడ పడితే అక్కడ కావాల్సినన్ని దండలున్నాయి. వాటిల్లో ప్రశస్తమైన దండ ఒకటి చండి ఏరితీసుకొచ్చి భర్త చేతికిచ్చింది. ప్రక్కగదిలోంచి తానే ఓ కుర్చీ తీసుకొచ్చి ఆ ఫోటో ఉన్న గోడదగ్గరగా వేసింది. గోవిందుడు ఆ కుర్చీమీద ఎక్కి తల్లి ఫోటోకి ఆ పూలదండ వేశాడు.

చండి ఆ కుర్చీ ప్రక్కనపెట్టి, భర్త



# ప్రసంగకౌశలము

ఇల్లిందల సరస్వతీదేవి

స్త్రీలలో పరస్పరము భాషించటాన్ని సల్లాప మంటారు. నేర్పరితనము నైపుణ్యము కౌశలానికి పర్యాయ పదాలు. సంభాషణాచాతుర్యమే సల్లాప కౌశలము.

ప్రతి వ్యక్తి సంభాషించి తీరుతాడు కదా! ఆ సంభాషణలోనూ - అనర్గళంగా మాట్లాడగలిగే వారెక్కడైనా నూటికీ కోటికీ ఉన్నారో లేదో. జీవితములో ఏ ఒక్కరితోనైనా - కొద్ది క్షణాలైనా సల్లాపించని వ్యక్తి కనబడటము అరుదు. ఆ సల్లాపానికి కౌశలము మెరుగులు పెట్టుతుందన్నమాట. సల్లాప కౌశలము ఒక కళ.

సల్లాపకౌశలాన్ని గురించి విదురుడు ధృతరాష్ట్రునితో ఏమన్నాడంటే “ఎదిరికి హితమును ప్రియమును మదికింపును గాగ బలుకు మాటలు పెక్కు, యుదహరింపను చెప్ప యటుగా, ఇది యది యన మారకునికి యొంతయు శక్యన్.” ఎదటివానికి హితము కలిగించేదిగాను, ప్రియముగాను, మనసు కింపుగాను ఉండేటట్లు సంభాషించాలి— అది చేతగాకపోతే మాట్లాడకుండా ఊరుకోటము ఉచితమని హితబోధ చేస్తారు.

ఇంటగాని బయటగాని ఎంతటివారికైనా వారు మాట్లాడే మాటతీరునుబట్టే ఎదటివారికి భక్తి, గౌరవము కలుగుతాయి. మాటతీరు మాత్రమే ఎదటివారి మనసులో నిలచిపోయి మాయని ముద్రలు వేస్తుంది. అందుకొరకే విదురుడొకచోట అన్నాడు —దేహానికి గుచ్చుకొనబడిన ముల్లును తీసి బాధను ఉపశమింపచేయవచ్చునుగాని, నిష్ఠూరమువలన మనసులో నాటిన మాటలను ఏ ఉపాయము చేతగాని తీయటము సాధ్యముకాదని.

సమాజములో మెసలేటప్పుడు అన్ని తరగతులవారితో కలిసి తిరుగుతూ పరిచయము చేసుకోవటము, చక్కగా పలకరించటము సల్లాపకౌశలములో చేరినవే. ఈ పలకరించటమే, మన్నితముగా - మృదువుగా ఎదటివారు ఏ తరగతికి చెందినవారైనా అనుకూలించేటట్లుగా ఉండాలి. సామాన్యులదగ్గర భోగాలను గురించిగాని విలువగల వస్తువులను గురించిగాని ప్రసంగించితే దానిలో స్వారస్యము లేకపోగా జుగుప్సాహేతువవుతుంది. గుమాస్తాగారి భార్యను పలకరిస్తూ ఒక పెద్ద వకీలుగారి భార్య “ఇక్కడ ఎండలు మండిపోతున్నాయి. ఊటీ అయినా బెంగుళూరయినా వెళ్ళందే బ్రతకలేము” అని గాని, “కాశ్మీరు వెళ్ళక తప్ప మొక్కుగుసెలు కాలేసుండా ఉన్నాము” అని గాని, కారులో వచ్చి కూడా “ఎంత దూరము! ఎంతదూరము!” అని గాని అంటే ఆ గుమాస్తాగారి భార్యకు ఎట్లా ఉంటుంది? మర్యాద కలది అయితే “అవునండీ” అంటూ మందహాసముతో వంతపలుకుతుంది. కొంత గడసరి అయితే “మమ్మల్ని మీతో కలుపుకుంటారేం? ఆ వాజాకులన్నీ మీ గొప్పవాళ్ళవి” అంటుంది. దానితో వకీలుగారి భార్య ఖులాసా కాస్తా తగ్గిపోతుంది. గుమాస్తాగారి భార్యకు ‘అసూయ - ఓర్వలేనితనము’ అని నిర్ధారణ చేసేస్తుంది. సమాజములో అంతస్తులమధ్య భావవైరుధ్యము ఇలాగే ఉత్పన్నమవుతుంది.

అపరిచితులతో సంభాషణ ప్రారంభించేటప్పుడు ఎదటి వ్యక్తిని బాగా గమనించాలి. ఆ వ్యక్తికి నచ్చేది, స్థాయికి సరిపడేది తెలిసి మాట్లాడగానే గెలుచుటము కష్టము. బాహ్యలక్షణాలనుబట్టి ఎంత గ్రహించినా ప్రారంభములోనే మనసును గ్రహించటము సులభము కాదు. ఆ సందర్భములో చేయవలసిన పని, ఇద్దరికీ సంబంధించిన విషయమును గురించి సంభాషించటము ఉచితము. ఈ రోజుల్లో అనేకపార్టీలు, అపార్టీలకు అనేక రంగులు ఉండటమువల్ల రాజకీయాలు అంతగా అనువుగావు. ఆ ప్రాంతములో బహిరంగముగా కనబడుతున్న వింతలుగాని వినోదాలుగాని చమత్కారపు పోస్టర్లుగా కనిపించే విషయాలుగాని కొంతవరకూ ఇందుకు పనికివస్తాయి.

సంభాషించేటప్పుడు ఎదటివ్యక్తి ఏవిధమైన ప్రసంగము చేసినా శ్రద్ధగా ఆలకించ

---

చెయ్యి పట్టుకుంది. ఇద్దరూ ఆ ఫోటో యెదుట నతజానువులై కూచుని “మేమిద్దరం ఈ శుభరాత్రివేళ ముందుగా నీ ఆశీర్వాదాన్ని కోరుతున్నాం తల్లీ! మాకు మనోబలాన్ని ప్రసాదించు. నీ ఆశీర్వాదంవల్ల మేము జ్ఞానవంతులం కావాలని భక్తిపూర్వకంగా ప్రార్థిస్తున్నాం” అంటూ నమస్కరించారు.

వ్రతం చేసేనాడు పురోహితుడు అన్న మంత్రాల నన్నిటినీ ఎలా అంటారో అలాగే చండి అనమన్న మాటల నన్నిటినీ గోవిందుడు తు.చ.తప్పకుండా గద్గదకంఠంతో ఉచ్చరించాడు. “రోజూ మనం ఉదయం, సాయంత్రం ఇలాగే ప్రార్థిద్దాం. తర్వాత ఉత్తమ విజ్ఞానాన్ని పొందటానికి కఠోరమైన సాధనను అవలంబిద్దాం” అన్నది చండి.

గోవిందుడు జిజ్ఞాసాదృష్టితో చండి ముఖంకేసి చూడసాగాడు. చివరిమాటలు అతనికి సరిగ్గా బోధపడలేదు. అది చండి గ్రహించి, “నామాటలు మీకు సరిగ్గా బోధపడలేదల్లే ఉంది. కాని నోటితో చెపితే బహుశా మీరు అర్థం చేసుకోలేరేమో! మనం సాధన మొదలెట్టాక ఒక్కొక్కటే అన్నీ మీకే అర్థమవుతాయి. కాని ఆలోచన క్రమానికి ఈ శుభరాత్రి సమయాన ఇదే ప్రారంభం. ఇవాళనుంచే మన సాధనకు కంకణబద్ధులం కావాలి. పదండి. మన పుస్తకాలగదిలోకి వెడదాం” అన్నది.

ఏమిటో ఇంక తనని పైన శాసించే పెద్దలెవరూ లేనట్లు తనే ఈ ఇంటికి సర్వాధికారిణియైనట్లు—అంత నిస్సంకోచంగా— అతి సహజమైన ధోరణిలో - చండి మంత్రముగ్ధునిలా ఉన్న భర్తని చెయ్యిపుచ్చుకుని పుస్తకాల గదివైపు తీసుకెళ్ళింది.

(సశేషం)





# ప్రసంగకౌశలము



టము మర్యాదలక్షణము. ఆ ప్రసంగవిషయాలు మనకు యిష్టము కాకపోతే వారితో ఏకీభవించకుండా ఉండవచ్చు - గాని అప్పటికప్పుడే ముఖము చిట్లించి - కళ్లెర్ర చేయటము అసభ్యత క్రిందికి వస్తుంది. ఎదటి వ్యక్తి చెప్పదలచినదంతా చెప్పనివ్వాలి - అసంతా నిదానముగా - ఓపికతో వినాలి. ఆవినటమువల్ల తన అభిప్రాయాలను ఘనముగా వింటున్నారనో - తనతో ఏకీభవించుతారన్న భావమో కలుగుతుంది దానితో శ్రోతమీద ఎక్కడలేని భక్తిగౌరవాలు కలుగుతాయి.

ఎదటివ్యక్తి సంభాషించిన దానిలో శ్రోత ఏకీభవించని విషయాలు అంశాలు ఉన్నప్పుడు వాటిని వ్యక్తపరిచే మెలకువలు కొన్ని ఉన్నాయి. "మీరు చెప్పినదంతా వాస్తవము - చాలా చక్కగా చెప్పారు. ఈ అంశాలు ఎందరికి తోస్తాయి కనుక?" అని ప్రారంభించి, తరువాత తనకు సంశయాగ్రస్తమైన అంశాలను ఎత్తి వాటి కష్టనష్టాలను గురించి సూచనప్రాయముగా ప్రారంభించి, క్రమముగా తన అభిప్రాయాలను ఏకరువు పెట్టితే తన మాటతో ఎదటివ్యక్తి ఏకీభవించే అవకాశాలున్నాయి.

ఎదటి వ్యక్తిని ఆకర్షించటానికి కొన్ని అంశాలు నిరంతరమూ జ్ఞప్తిలో ఉంచుకోవలసినవి ఉన్నాయి. ఇతరుల మాటలలో గాని - వేషములో గాని భావములో గాని దోషము ఎన్నకూడదు; విమర్శించకూడదు. ఇతరుల నాకర్షించి వాళ్లచేత మన్నన పొందవలెనంటే సంభాషించేటప్పుడు ఆత్మప్రశంసను కొస్త పక్కకునెట్టి ఎదటివారికి ప్రాధాన్యత నివ్వవలసి ఉంటుంది.

సంభాషణ ప్రారంభించటమే స్నేహపూర్వకముగా ప్రీతితో ప్రారంభించాలి. ఎదటివారు కూడా విద్యాసంస్కారమూ గౌరవమర్యాదలు కలవారన్న సద్భావములో ప్రసంగము సాగనివ్వాలి. సంభాషణలో ఆప్యాయత చాలా ముఖ్యము. దీనిలో కొన్నిపాళ్లు స్తుతి ఉండటము కూడా కోరతగినది. ఈ స్తుతి మోతాదు మీరకుండా జాగ్రత్త వహించాలి. అతి తీపిలో ఉన్న గుణమే అతిగా స్తుతించటమువల్ల కూడా కలుగుతుంది. ఎదటి వ్యక్తిలో కనబడుతున్న ఏ కొద్దిగుణాలయినా తగుమాత్రముగా ముందు స్తుతించుతూ అభినందించుతూ సంభాషణ ప్రారంభించాలి. పొగడ్తలో కూడా గమనించవలసిన వనేక అంశాలున్నాయి. వాస్తవికతకు దగ్గరగా ఉండాలిగాని మేర దాటకూడదు. నల్లగాఉన్న వ్యక్తిని పట్టుకొని 'మీది పసిమిచాయ' అంటే ఎదటి వ్యక్తి మనసు ఆ మాటకు ఉప్పొంగకపోగా చురుక్కుమంటుంది. నలుపులోని నాణ్యమును గురించి ప్రసంగించితే వ్యవహారము బెడిసికొట్టకుండా మనసుకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

ఎదటవ్యక్తినిగురించి ఏ విషయమైనా తెలుసుకోవాలంటే సూటిగా ప్రశ్నించటము అమర్యాద క్రిందికే వస్తుంది. మాటవరుసకు ఈకాలములో మగవాని సంపాదన గురించిగాని, స్త్రీ వయసునుగురించిగాని ప్రశ్నించటము నేటి అసభ్యతాలక్షణాలలో చేరినవనుకుందాము. ఈ సందర్భములో ఆ విషయాలనుగురించి తెలుసుకోదలచుకుంటే లోకాభిరామాయణము ప్రసంగించుతూ ఆ విషయాలలో అప్పుడప్పుడు ఆవ్యక్తిని కదలించుతూ ఉండాలి. ఈ కాలపు పోకడలు - వార్తలు వింటున్న వ్యక్తి - స్తోత్రసుధను రుచిమాసిన కైపులో మనము కోరే విషయాలను బయటపెట్టే అవకాశాలు ఉన్నాయి వేషాన్నిబట్టి ఉనికినిబట్టి కొంతవరకూ ఊహించినా — నికరముగా తెలుసుకోదలచుకుంటే: "మీరు యింకా కారుకొనకుండా మాలాగ బస్సులలో తిరుగుతున్నారేం?" అని ఒక్కమాట విసిరితే సరి. 'ఎదటివారికంటె తాను గొప్ప కదా' అని ఉబ్బితబ్బిబ్బయి ఉన్న సంగతి కాస్తా బయటపెట్టనివాళ్ళు అరుదు.

మాట్లాడేతీరులో గమనించవలసిన ముఖ్యాంశాలు చాలా ఉన్నాయి. ఈ సూత్రాలన్నీ అందరిదగ్గరా ఒకే విధాన ఉపయోగపడవు. ఎదటి వ్యక్తికీ తనకూ మధ్య ఉన్న సంబంధబాంధవ్యాలనుబట్టి మారుతూ ఉంటాయి. అపరిచితులతో అంటీ ముట్టకుండా ప్రసంగించిగాని, కళ్లు మూసుకుని కాస్త పొగిడిగాని, మనసు నాకర్షించటము వేరు. ఒక్కొక్కసారి వ్యక్తికి రచ్చ గెలవటములో ఉన్న సౌలభ్యము ఇంట కనబడదు.

అద్దాలలో పెరిగిన కుమారుడు యువకుడై - కుటుంబీకు డవుతున్నాడనిగానీ— అతని జీవితములో అనేక యితరవిషయాలు ప్రధానము లవుతున్నాయనిగానీ ఏ తల్లీ సామాన్యముగా అంగీకరించదు. పరాయి పిలవచ్చి తనకూ తన కుమారునికీ కాకుండా చేసిందని అపోహపడుతుంది. లోకము చెడ్డదయి తననుంచి తన కొడుకును వేరు చేస్తున్నదని మనసు చెడగొట్టుకుంటుంది. సంఘములో ఈ సొదకు ఎరఅయేది కోడలు. ఈ సందర్భములో కొడుకు జాగ్రత్త వహించి, మాటలలో క్రియలలో తల్లికి ప్రాధాన్యమిచ్చి ఆ వెనుక ఏ భాగవతమాడినా సుఖిస్తాడు. దీనిని పాటించక పోవటముచేతనే కిన్నెర (శ్రీ విశ్వనాథ విరచితము) భర్తకు ఆ పాట్లు వచ్చాయి. తనను స్వర్గసీమదాకా త్రిప్పి తీసుకొనివచ్చే అర్ధాంగి అత్తబాధల కోర్వలేక అడవులకు పరుగెత్తి ఆ వేదన భరించుకోలేక వాగైపోయేవరకూ మనసు విప్పి ఒక తియ్యటి మాట ఇటు భార్యతో గాని అటు తల్లితో గాని మాట్లాడి యెరుగని అమాయకుడు. చివరకు శిలగా మారిపోవలసి వచ్చినది.

అన్నదమ్ములు పరస్పర సాదృశ్యములతో రాణిస్తే - తోడల్లుళ్ళు పరస్పర వ్యత్యాసాలతో రాణిస్తారు. తోటికోడళ్లూ ఇంతే. ఈ కూటాలలో పరాయివారు మంచిమాటలతో మెలగటము చాలా కష్టము. వెనకటికి ఒకరు రాజుగారి పెద్దభార్య చాలా మంచిదన్నాడట. ఆ తరువాత అతడాగినా ఆ మాటయొక్క అర్థము అంతటితో ఆగక పోయింది. ఇటువంటి కష్టాలు ఈ వలయములో అనేకము ఎదురవుతాయి. సంబంధము చూస్తే అతి సన్నిహితముగా ఉంటుంది. కాని వ్యక్తికీ వ్యక్తికీ మధ్య దాటరాని వారధులుంటాయి. పరాయి వ్యక్తి ఆ కూటమిలో ఒకరినిగురించి మరొకరిదగ్గర చెప్పకూడదు. ఎంత మంచి అభిప్రాయముతో మెలగినా - అంటీ ముట్టనట్లు ప్రసంగించినా - వ్యవహారము బెడిసికొట్టుతునే ఉంటుంది.

ఇద్దరు తోడల్లుళ్ళు ఒక ఊళ్లో ఉండటము తటస్థించిందట. ఇద్దరూ ఘన వైద్యులే. ఇద్దరూ పరోపకారులూ సహృదయులు. ఒకసారి వాళ్ల బంధువు వైద్యము చేయించుకోవలసివచ్చి ఆ ఊరు వచ్చాడు. మొదట ఒకాయనదగ్గరికి వెళ్లగా ఆయన ఊళ్ళో లేరని తెలిసి రెండవ ఆయనదగ్గరకి వెళ్ళాడు. అతడు చాలా ఆదరముతో పలకరించి వైద్య మారంభించాడు. ఆ బంధువు మరునాడు మాటలధోరణిలో మొదట తాను ఆ యింటికి వెళ్లటము అక్కడినుంచి ఇక్కడికి రావటాన్ని గురించి ప్రసంగిస్తూ "నాకు ఇద్దరూ సమానులే" అన్నాడు. అట్లా చెప్పటములో ఇద్దరియెడల తన కున్న సమభావాన్ని అతడు మెచ్చుకుంటాడని అ



కున్నాడు. దానితో ఆ వైద్యుడు "ఆయన లేకపోబట్టి నా యింటికి వచ్చారు గాని ముందు రాలేదుగా!" అని నిర్లక్ష్యముగా ప్రవర్తించాడట.

'అది లేదు – ఇది లేదు' అని ఆ స్తమానమూ గొణిగే భార్యల పోరు పడలేక కొందరు భర్తలు ఇంటి పెత్తనము డబ్బు భార్యలకు యిస్తూఉంటారు. ఆ పెత్తందారీతనములో ఏమి మాహాత్మ్యము ఉన్నదో – అదివరకూ లేని హోదా కొత్తగా వచ్చినట్టు భావించి తమ యాజమాన్యములో ఏది లేకపోయినా సరిపెట్టుకొని కాపరాలు చేసే ఉవిదలున్నారు. పాపము అదివరకు పూటకు పదిచీరలుమార్చే పడతులయినా సంతృప్తికరముగా రెండు చీరలనే మార్చిమార్చి కట్టుకుంటూ ఉంటారు. దీనికి కారణము భర్తల మాటలలో ఉన్న మాధుర్యమే. "ఎట్లాగయినా ఇంటిని ఇల్లాలే నిర్వహించాలి. ఆ పొదుపు నైపుణ్యము మగవాడికి ఎట్లా వస్తాయి" అంటూ కాస్త స్తుతించి చిరునవ్వు నవ్వగానే పొంగిపోయి ఆ సంసార భారాన్ని చేతకాకపోయినా తలకెత్తుకొనే గృహిణులున్నారు. భార్యాభర్తలు తొలినాటి ఆకర్షణలను నిలుపుకోదలచుకుంటే పరస్పరము వారిలో ఉన్న ఏ కొద్ది గుణసంపదనయినా సరిగుర్తించి మసలుకోవాలి. తన భార్యే కదా, ఏవిధముగా మాట్లాడినా చెల్లుతుందని భర్త భ్రమపడితే సుఖానికి దూరమవుతాడు. భార్యకయినా అంతే. స్వజనముతో కూడా మెలకువగానే ఉండాలి. వాళ్లను విసిగించకుండా మంచిమాటతో మెలగాలి. వాళ్ల తెలివితేటలను అప్పుడప్పుడు ప్రశంసించుతూ ప్రోత్సహించి ఎంత పనైనా చేయించుకోవచ్చు.

సామాన్యముగా పెద్దవాళ్లు పిల్లలతో సరిగా మాట్లాడరు. చాలామంది పిల్లలు తల్లిదండ్రులు ఇంట్లోవాళ్లు చెప్పినదానికంటె ఇతరులు చెప్పితే బాగా వింటారు. తమ బిడ్డలే కదా అని కోపము చికాకు చూపిస్తూ తిట్టి అరిస్తే వాళ్లకేం లక్ష్యము? బిడ్డలను కూడా మంచిమాటతోనే ఆకర్షించాలి. వాళ్లనుకూడా పెద్దవాళ్లవలెనే మర్యాదగా పలకరించి సమానుడితో ప్రసంగించినట్లుగా సంభాషిస్తే వాళ్లుకూడా బుద్ధిమంతులుగా మెలగి చక్కగా మాట్లాడుతారు. బిడ్డలచిత్తవృత్తిని గ్రహించి మాటల మాధుర్యముతో వాళ్లను కీలుబొమ్మలను చేయవచ్చు. "అబ్బాయీ! నీవు ఈపనిని బాగా చేస్తావట. నీవుతప్ప మరెవరూ ఈ పని చేయలే"రని పొగడి ఆ కార్యభారాన్ని పిల్లవాడిమీద మోపితే – తానెంతో సమర్థుడనని పొంగిపోయి—ఉత్సాహముతో పని పూర్తి చేస్తాడు. "ఈపని నీవు చేస్తుంటే చూడాలని ఉన్న"దంటే ఏ బిడ్డకయినా ఎంతసంబరమో చెప్పనలవికాదు. మంచి మంచి అంటుంటేగాని ముఖ్యముగా పిల్లలలో మంచితనము పుట్టుకొనిరాదు.

రాజకీయముగాను – సాంఘికముగాను వ్యక్తి గౌరవప్రతిష్ఠలను సంపాదించవలెనంటే సల్లాపకౌశలము చాలా అవసరము. నాయకులు నియంతలు కార్యకర్తలలోని దోషాలను లోపాలను విస్మరించి గుణాలను స్మృతికి తెచ్చుకొంటూ ఉండాలి. అప్పుడప్పుడు "మీ తోడ్పాటు వల్లనే ఈ కార్యము గట్టెక్కింది. మీసహకారము లేకపోతే నేను ఒక్కడినీ ఇంతపని చేయగలిగి ఉందునా?" అని ఏకొద్ది మాటలతో ప్రశంసించినా కార్యకర్తలెంతో ఆనందిస్తారు. ఇనుమడించిన ఉత్సాహముతో తిరిగి పనులందుకుంటారు. ఆపనులు అసాధ్యములుగా తోచేవాటిని కూడా విపులముగా బోధించి, వాటిని ఆచరణలో పెట్టే సౌలభ్యాన్ని కూడా సూచించితే "ఇంత సులభమా! ఇంకా – ఎంతో కష్టమనుకున్నామే!" అంటూ ప్రజలు అధిక సంఖ్యలో కార్యరంగములోకి దూకే అవకాశాలున్నాయి. "ఈయన వల్ల తప్ప దేశము ముందుకురాదు" అని ప్రజలచే శ్లాఘింపబడిన నాయకులూ నియంతలూ ఈ పై సూత్రాన్ని ఉపయోగించుకున్నవారే.

దౌత్యము విజయవంతము కావటానికి సంభాషణా కౌశలము ఎంతో తోడ్పడుతుంది. రాయబార మంపినవారి సదుద్దేశ్యము ముచ్చటగా – తేనెలొలికేటట్లుగా – సొంపుగా ప్రసంగించితే ఎదుటివారి హృదయములోకూడా సద్భావము కలుగుతుంది. ఈ కౌశలముచేతనే రాయబారులూ ప్రతినిధులూ తమ దేశాల విద్యావిజ్ఞానాలనూ ప్రత్యేక సాంస్కృతిక విశిష్టతలనూ విదేశాలలో చాటి తమ దేశాలకీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింప చేస్తున్నారు. సంభాషణలో జాగ్రత చాలా ముఖ్యమైనది.

సీతమ్మను అపహరించిన రావణునితో వానరుడైన హనుమంతుడు తాను లంకకు వచ్చిన కారణము ఎంత జాగ్రత్తగా తెలుపుతాడో గమనింపతగినది. "రావణా! సుగ్రీవుడు నీతో కొన్ని మాటలు చెప్పుమనినదని నన్ను పంపినాడు. నీకు తోబుట్టువు వంటివాడైన సుగ్రీవుడు తన క్షేమమును నీకు తెలుపుమన్నాడు" అని ప్రారంభించి, "దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుడైన రాముడనువాడు తమ్మునితోను భార్యతోను దండకారణ్యములో ఉండగా పతివ్రతయైన జానకి అగపడకపోయినది" అని తెలుపుతూ, "నేను సీతానిమిత్తమై సముద్రము దాటి ఆమెను వెదకుచుండగా నీ పట్టణములో సీతమ్మ నాకు కనబడ్డది" అంటాడు. రాముడు సీతమ్మకొరకై పడుతున్న పరితాపమును కంటితో చూసిన హనుమంతుడు – రాక్షస స్త్రీల నడుమ మాసిన చీరతో రామదర్శన లాల

 

# శ్రావణం



## 'అనంతం'

ఈ శ్రావణ శుభదినాల
కెంత అందమే చెల్లీ!
ఎన్నాళ్ళకు తెలుగుతల్లి
హృదయ మలరెనే తల్లీ!!

ఎటుచూచిన పేరటాండ్రు
ఇంపుగులుకు వీథులివే!
ఎటుకనినా జయగౌరీ
హేమ నూపురధ్వనులే!!

ఎల్లెడలా వేదఘోష
ఉల్లసిల్ల విప్రవితతి,
*'శ్రావణి' స్వీకరించి
చల్లగ దీవించినారు.

సిలజలని పంక్తులపై
వ్రాలు వెలుగు మాలలవే!
నల్లని దేహాలమీద
తెల్లని జంధ్యాలవోలె!!

గోదావరి 'మహాతల్లి'
కోప ముపశమించింది.
'ఒక్కసారి' హెచ్చరించి
ఒదిగి ఒదిగి నిలిచింది.

'వరలక్ష్మీవ్రతము'న, సతి -
కరకీలిత తోరమ్ముల
ప్రభావాలు తెలుగునేల
పాలించును శుభాలొసగి.

[* వేదపండితులకు శ్రావణంలో ఇచ్చే 'మామూలు']



# ప్రసంగ కౌశలము



సయి దీనాతిదీనంగా విలపిస్తూన్న జానకిని కంటితో చూసిన హనుమంతుడు - కోపము కొద్దీ ముఖము జేవురించి పిడికిళ్ళు బిగిసిపోతున్నప్పటికి నిగ్రహించుకొని "నీవు సీతమ్మను అపహరించి తీసుకొని వచ్చావు" అని పొరబాటుగానైనా అనకుండా "నీ పట్టణములో సీతమ్మ నాకు కనబడ్డది" అని రావణునితో అనటములో అతడికి గల సల్లాపకౌశలము విదితమవుతున్నది.

ఈవిధముగానే రామాయణములో సరసముగా సల్లాపించిన పాత్రలలో తార ఒక్కతె. తనకు చేసిన వాగ్దానమును మరచి, స్త్రీలతో విహరిస్తూ కాలము గడుపుతున్న సుగ్రీవుడిని హెచ్చరించి రమ్మని రాముడు లక్ష్మణస్వామిని పంపుతాడు. లక్ష్మణుడు ఆగ్రహావేశముతో సుగ్రీవుడి అంతఃపురము ముందర నిలబడి అతడిని బయటికి రమ్మని కేక పెట్టాడు. సుగ్రీవుడికి ప్రతిగా తార బయటికి వచ్చి, ముందుగా సుగ్రీవుడు చేసిన మహాపరాధాన్ని ఒప్పుకొని-ఆతరువాత—సుగ్రీవుడు అప్పుడున్న పరిస్థితులలో అతడికి స్త్రీలోలత్వము ఉండటము చాలా సహజమనీ అనింద్యమనీ వింత సరసంగా అతడిని సమర్థించుతూ సంభాషించింది రసజ్ఞులైన పాఠకులకు తెలిసిన విషయమే.

అధికుల ఎదుట వారి ప్రతాపము, వారి గొప్పతనము, వారి మంచితనము ప్రశంసించుతూ తన నోక అణువు క్రింద జమకట్టుకొని తాను ఆ స్థితిలో ఉండగలిగినది వారి ప్రతిభవల్లనేనని ఉద్ఘాటిస్తూ సంభాషణ సాగనివ్వడం క్షేమం. దీనిలో ఎక్కువ కష్టము కనబడదు. క్రిందివారితో ప్రసంగించటము కూడా చాలా మందికి సులువే. తమ ప్రాపకములో అందరూ ఉండగలుగుతున్నారన్న 'అహం'లో చాలామంది "మీరంతా క్షేమమేనా? ఏమీ ఇబ్బంది పడటము లేదుకదా!" అంటూ ప్రభుభృత్యుల భావముతో సరసముగానే సంభాషిస్తారు. కాని సమానులతో సరసముగా సంభాషించటమే కొంచెం కష్టమైనపని. సమాన హోదాలో ఉన్న ఇద్దరు వ్యక్తుల మనస్తత్వాలు చాల విచిత్రముగా ఉంటాయి. తనకంటె ఎదటివ్యక్తి ఏ చిన్నవిషయములోనైనా ముందుకుపోయినట్లు సూచనప్రాయముగా తెలిసినా వ్యక్తి భరించలేడు. పైకి వ్యక్తపరచడానికి వీలులేని పరిస్థితులలో వాళ్లి మనసులు మరీ మగ్గిపోతాయి. ఆ సందర్భములో బయట ఎవరితో తన ప్రతాపాన్ని గురించి చెప్పుకొన్నా సమానులతో మాత్రము జాగ్రత్తగా ఏ విషయములోనూ తాను మించిపోవటము లేదనీ తన పని అసాధారణంగానే ఉన్నదని చెప్పితే వాళ్ళ మనసు దల్లబడుతుంది. కొంతమందికి ఇతరుల పిల్లలు బాగా ఉన్నారనో . పైకి వస్తున్నారనో- మనసులో కుట్టుగా ఉంటుంది. దానిని వ్యక్తపరచటానికి సభ్యత అడ్డము వస్తుంది. కాని అసూయ ఎంతఆపినా ఆగక మరోరూపములో బైటికి వస్తుంది. ఇది జ్ఞాతులలో ఎక్కువగా ఉంటుందనటానికి భారతకథే సాక్షి. అటువంటి వాళ్ళదగ్గర ఆపిల్లలవల్ల కలిగే కష్టనష్టాలను వర్ణించి ఏకరువు పెట్టితే వాళ్లబాధ కొంత ఉపశమిస్తుంది. కొంతమందికి తనతోటివాడు తనకంటె ఆర్థికముగా బాగుపడిపోతాడేమో నని దిగులుగా ఉంటుంది. అటువంటి వారితో ఎప్పుడూ బీదఅరుపులు అరిస్తే తృప్తిగా మాట్లాడుతారు.

వ్యక్తుల సభ్యతాసభ్యతలు మాట మంచితనముమీద ఆధారపడటమే కాకుండ వృత్తిలో జయము కలిగిస్తాయి. పని ఎట్లా చేసినా తియ్యనిమాటలు మాట్లాడి అధికారి మెప్పును పొందే ఉద్యోగులూ ఉన్నారు. పనిబాగా చేసినా తలబిరుసుగా మాట్లాడి అధికారి అనుగ్రహానికి దూరమయ్యేవారూ ఉన్నారు. ప్రజలకు తమయెడల మంచి భావముకలిగి, తాము తలపెట్టిన కార్యమునకు ప్రజలతోడ్పాటు కావలెనని కోరుకొనే సంఘసేవకులకు సల్లాపకౌశలము చాల అవసరము. సంభాషణాకౌశలమే వారికి దిగ్విజయాన్ని యిస్తుంది. భీమా కంపెనీ ఏజంటు బ్రోకర్లు, ప్రతినిధులూ సంభాషణా కౌశలముచేతనే తమ కార్యాలను విజయవంతముగా సాధించుకొనగలుగుతున్నారు.

ఈ కాలములో ప్రకటనలుకూడా మనోరంజకముగా లేకపోతే చలామణీ కావటము లేదు. అదికూడా మనసు నాకర్షించేటట్లుగా కథలతో కబుర్లతో బొమ్మలతో ప్రత్యక్షమయితేనే గాని విలువ లేకుండా ఉన్నది. ఆ స్థితిలో సల్లాపకౌశలము లేనిదే వ్యక్తులకు లోకవ్యవహారము నడుస్తుందా? కనుకనే అనుభవజ్ఞులొకరు

"విద్య లఖిలంబు గరచిన విబుధుడైన
సకలశర్కంబు లెరిగిన సరసుడైన
ప్రజ్ఞలెల్ల గడించిన ప్రాజ్ఞుడైన
క్రమము మర్యాదలేకున్న గనడు ఫలము"

అన్నారు.

ఈ క్రమము మర్యాద క్రిందనే సల్లాపకౌశలము కూడా చేర్చతగినది. 

# బొమ్మరిల్లు

## పిచ్చి కుక్క

భాస్కరం, ప్రభాకరం

"అచ్యుతయ్యపంతుల్నొక
పిచ్చికుక్క కరిచిందట!"
"అచ్యుతయ్య పంతుల్నే!
అయ్యబాబో! అయ్యబాబో!"

కళవళపడి బేజారై
కంగారుగ పరుగెత్తిరి
పనులు వదలి పరుగెత్తిరి
జనులంతా, జనులంతా.

పాపం కంగారుపడుతు
పరుగెత్తుకు వచ్చినట్టి
పాలికాపువాని కుక్క
బలే కుక్క, భలేకుక్క!

దొంగగాని కనబడితే
తరిమి తరిమి కొడుతుందని
దొంగల కాకుక్కంటే
తగనిభయం, తగనిభయం

అది యేమో నిన్నటుంచి
అరుపు మొదలుపెట్టింది
పెద్దవాళ్లు అన్నారూ—
"పిచ్చికుక్క, పిచ్చికుక్క!"

అరచి అరచి పరుగులెత్తి
మొరిగి మొరిగి వెంటతరిమి
అచ్యుతయ్య కాలుకరిచె
'పిచ్చికుక్క, 'పిచ్చికుక్క!'



కళ్లు తిరిగి అచ్యుతయ్య
ఒళ్లు తూలిపడగానే
చుట్టూరా మూగినారు
జనమంతా, జనమంతా

"అచ్యుతయ్య! పెద్దమనిషి,
అబద్ధాలు కపటాలూ
కలుషాలూ మోసాలూ
తెలియవుగద, తెలియవుగద

"పాములకే పాలుపోసి
పెంచునంత మంచివాణ్ణే
వెతికి వెతికి పట్టి కరచె
వెధవకుక్క, వెధవకుక్క"

అంటూ జను లాకుక్కను
వెంట తరిమి కొట్టినారు
తోకముడిచి కుక్కపిల్ల
దాడుతీసె, దాడుతీసె

* *

పడిపోయిన అచ్యుతయ్య
ప్రజలంతా తన్నుమోయ
పోయిమంటు తరలినారు
హాస్పిటలుకు, హాస్పిటలుకు

ఆస్పత్రిలో తనచుట్టూ
అందరు జనులూ గొలువగ
ఇల్లుచేరె అచ్యుతయ్య
ఒళ్లు కుదిరి, కళ్లు తెరిచె!

* *

ఒళ్లు గాయమయినకుక్క
కళ్లు తిరుగ తూలిపోతు
మర్రిచెట్టుకింద చేరి
మూలిగింది, మూలిగింది.

పాలికాపు కుర్రవాడు
పాలుపోసి పెంచుకున్న
కుక్కపిల్ల చచ్చిపోయె
దిక్కులేక, దిక్కులేక!

* * *

అచ్యుతయ్య - పిచ్చికుక్క
ఎవరివిషం ఎవరికెక్కె?

సీరియల్:-




మూలం: ఆల్ఫాన్స్ డాడే

## జరిగిన కథ

[మా నాన్నగారు—మష్యూ ఐసెట్టి—లాన్‌గ్యుడాక్‌లో పెద్ద సిల్కు వ్యాపారి. సొంత ఫ్యాక్టరీ అవీ వుండేవి. నేను (చిన్నా) పుట్టినరోజు లగాయతూ మా కుటుంబాన్ని ఏదో ఒక ఆపద చుట్టుముట్టేస్తూనే వుంది. చివరికి దేశంలో వచ్చిన విప్లవం మూలంగా మా నాన్నగారిస్థితి పూర్తిగా చితికి పోయింది. కొంతకాలానికి మా నాన్నగారు దివాలా తీసి మా ఫ్యాక్టరీని అమ్మేశారు. మేము మా స్వస్థలం విడిచిపెట్టి లయాన్స్ పట్టణానికి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ తరువాత కొంతకాలానికే మా నాన్నగారు వ్యాపారంలో మళ్ళా దెబ్బతిన్నారు. మా సంసారం రెండోసారి చితికి పోయింది. ఉన్న నలుగురం విడిపోవలసి వచ్చింది. మా అమ్మని పుట్టింటికి పంపేశాం. జాక్‌ని లయ్యాన్స్‌లోనే ఒకకొట్లో గుమాస్తాగా చేర్చారు మా నాన్న. తను సారా వుత్పత్తిదార్ల సంఘంతరఫున ఒక వుద్యోగం సంపాదించుకొన్నారు. నన్ను తనదగ్గరకు పంపితే దాక్షిణాత్య విశ్వవిద్యాలయంలో 'అషర్' వుద్యోగం యిప్పిస్తానని మా నాన్నగారి స్నేహితుడైన 'రెక్టర్' జాబు రాశాడు. తక్షణం బయలుదేరి ఆ వూరు వెళ్ళాను. 'రెక్టరు' నన్ను 'సర్లాన్‌డీ' కాలేజీలో 'అషర్' వుద్యోగానికి సిఫార్సు చేస్తూ జాబు రాసియిచ్చాడు. వెంటనే బయలుదేరి చీకటిపడే సమయానికి ఆవూరు వెళ్ళి ప్రిన్సిపాల్ గారి దర్శనం చేసుకొన్నాను. ఆయన, పొట్టిగా వున్నందుకు నన్ను ఆ వుద్యోగంలోకి తీసుకోవటానికి ముందు సందేహించినా తరువాత మనసుమార్చుకు వుద్యోగం యిచ్చారు. మర్నాడు వుదయం పనిలో ప్రవేశించాను. అంతా బాగానే వుందికాని, సూపరింటెండెంటు వియాట్ గారి తాళం చెవుల చప్పుడు మాత్రం నన్ను ఎందుకో చాలా భయపెట్టేది.

## 6. జూనియర్ తరగతి పిల్లలు

నా అజమాయిషీకింద ముప్ఫైఐదుమంది చిన్నపిల్లలు వుండేవాళ్లు. చాలా బుద్ధిమంతులు. చక్కగా చూడ ముచ్చటగా వుండేవాళ్లు. వాళ్లతో గడిపిన ఆరోజులు నిజంగా నాజీవితంలో మధురాతి మధురమైనవి. కొంచెం పెద్దపిల్లలుకూడా వుండేవాళ్లు. కాని వాళ్ళంతా వొట్టి పోకిరీవెధవలు. ఈ పసివాళ్లు అల్లాక్కాదు. నాకు కోపం తెప్పించేపని వీళ్లు ఒక్కనాడైనా చేయలేదు. వాళ్ళని నేనేనాడూ దండించి ఎరుగను. దండించవలసిన అవసరం ఏముంది? హాయిగా కేరింతాలు కొట్టుతూ కిచకిచలాడుకొంటూ అమాయికంగా తిరిగే పిట్టలని ఎవరైనా దండిస్తారా? వీళ్లూ అల్లాంటివాళ్లే. అధవా ఏనాడైనా వీళ్ల కిచకిచలు మరీ శృతిమించిపోతే ఒక్కసారి 'సైలెన్స్' అనేవాణ్ణి. అంతే. ఎక్కడివాళ్లక్కడ గప్‌చిప్.

ఈ ముప్ఫైఐదుమందిలోనూ ఒక్కడు మాత్రమే పదకొండేళ్లవాడు. మిగిలినవాళ్లంతా పదేళ్లలోపువాళ్లే. ఈ పదకొండేళ్లవాణ్ణి తాను చెవులెక్కదీసి సరైనమార్గంలో పెట్టానని సీనియర్స్ నాతో గొప్పగా చెప్పుకొన్నాడు. కాని నేను మాత్రం వాడి చెవులు ఏనాడూ ఎక్కదీయకుండా, వాడితో మంచిగా వుంటూనే వాణ్ణి దారిలో పెట్టాను.

చెప్పిన పాఠాలన్నీ చక్కగా బుద్ధిమంతుల్లా పిల్లలందరూ అప్పచెప్పినప్పుడు బహుమతిగా వాళ్లకి చక్కచక్కని కథలు చెప్తుండేవాణ్ణి. కథ చెప్పబోతున్నాననేసరికే పిల్లలందరి ముఖాలూ ఒక్క

అనువాదం: విశాంతపు లా నరసింహాచారి



# అన్నా - చిన్నా



సారిగా విప్పారిపోయేవి. వెంటనే టెక్స్ట్‌పుస్తకాలూ, నోటుబుక్కులు, కలాలూ సిరాబుడ్లూ అన్నీ టకటకా డెస్కుల్లోకి వెళ్ళిపోయేవి. ఏపిల్లవాణ్ణిచూసినా మోచేతులు బల్లమీద ఆనించి, కథ వినటానికి సిద్ధంగా చెవులు రిక్కించుకు కూర్చునేవాడు. వాళ్ళకి చెప్పటంకోసం ఎప్పటికప్పుడు కొత్త కథలు చదువుతుండేవాణ్ణి. ఆ కథలనే మార్చి, నా చిన్ననాటి అనుభవాలూ జ్ఞాపకాలనీ జోడించి గమ్మత్తైన కథలు తయారుచేసి చెప్తుండేవాణ్ణి. చిన్నప్పుడు నే పడ్డ కష్టాలూ, పొందిన పరాభవాలూ ఆ కథల్లోని పాత్రలైన ఏకుందేలుకో, ఏ పంచవన్నెల రామచిలుకకో అంటగట్టేవాణ్ణి. అన్నట్లు - మా అన్న 'జాక్' లాగా అస్తమానం ఏడుస్తూ కూర్చునే ఆడకత్తులు కొన్ని ప్రతికథలోనూ తప్పకుండా వస్తుండేవి. మొత్తానికి యీ కథలు వినటం అంటే పిల్లలకి ఎంత సరదాగా వుండేదో, చెప్పటం అంటే నాకూ అంత సరదాగానూ వుండేది. కాని యీ సరదాలు స్కూలు సూపరింటెండెంటు వియట్‌గారికి ఏమీ నచ్చినట్లు లేదు.

ఒకరోజు నేను క్లాసులో కుందేలు కథ చెప్తున్నాను. కుందేలు ఒంటరిదై పొట్టకూటికోసం బయలుదేరి ఒక చిన్న వుద్యోగంలో చేరి నానాకష్టాలూ పడుతోంది. కథ ఆదశకు వచ్చేసరికి, తాళంచెవుల రాక్షసుడు వియట్, నాక్లాసుకి హఠాత్తుగా వచ్చి, వెకిలినవ్వు నవ్వుకొంటూ నిలబడ్డాడు. ఆయన రంగంమీద ప్రవేశించటంతో వాతావరణం అంతా ఒక్కసారిగా మారిపోయింది. అమితమైన ఉత్సాహంతో కథ వింటున్న కుర్రాళ్ళందరూ, ఆయన్ని చూసి భయపడిపోయి, తలలు దిసుకుపోయి డెస్కులకింద దాచేసుకొన్నారు. అనర్గళంగా కథ చెప్పకుపోతున్న నా కంఠం మూగబోయింది. కథలోని కుందేలుకూడా యీ తాళంచెవుల రాక్షసినిచూసి భయంతో కొయ్యబారిపోయిందా అనిపించింది.

ఇన్ని మార్పులకు కారణభూతుడైన ఎమ్. వియట్ తానుమాత్రం ఒక్కమాట అయినా మాట్లాడకుండా అలా నిలబడి వున్నాడు. ముఖాన ఆ అర్థంలేని [illegible]

వెకిలినవ్వుమాత్రం నిరంతరంగా వినిపిస్తోంది. 'ఇదా, నువ్వు చెప్తున్న చదువు కబడ్దార్!' అని అవి నన్ను హెచ్చరిస్తున్నట్లు అనిపించింది. ఎల్లాగోలాగు వాటిని వెంటనే పూడుకోబెట్టితే కాని నా మనస్సు నిలవటంలేదు:

"గడచిన వారం పదిరోజులుగా పాఠాలు చదివి చదివి వీళ్లు తెగ అలిసిపోయారు. అందుకని కొంచెం హుషారుచేసినట్లు అవుతుందని నేనే కథ చెప్తున్నాను." అన్నాను, చేతులు నలుపుకొంటూ.

ఆ వాక్యం పూర్తిచెయ్యకముందే ఎం. వియట్ అతివినయంగా వొంగివొంగి సలాంపెట్టి, అంతకంటె వెకిలిగా నవ్వి, తాళంచెవులు ఆడించుకొంటూ చక్కా పోయాడు. సాయంకాలం నాలుగు గంటల విశ్రామ సమయంలో నాదగ్గరకువచ్చి నిబంధనావళి పుస్తకం తెరిచి అందులోని పన్నెండో నిబంధనను నాకు వేలు పెట్టి చూపించాడు.

దాన్నిబట్టి క్లాసులో కథలు చెప్పటం కూడని పని అని బోధపడింది. మళ్లా ఆపని ఎన్నడూ చెయ్యలేదు.

ఈ సంఘటన జరిగాక కొద్దిరోజులపాటు కుర్రాళ్లకి ఏమీ తోచిందికాదు. కథలో కుందేలుగతి ఆ తరువాత ఏమైందో తెలుసుకోవాలని చాలా మథనపడ్డారు. ఏమైందో చెప్పాలని నాకూ చాలా అనిపించిందికాని, చెప్పటానికి సాహసించలేకపోయాను.

కాలేజిలో మొత్తం మూడుగ్రూపులు వుండేవి: సీనియర్, ఇన్‌టర్‌మీడియెట్, జూనియర్. జూనియర్ గ్రూపు కుర్రాళ్లు నా అజమాయిషీకింద వుండేవాళ్లు. స్నిగ్ధకోమలహృదయులైన ఆ బాలలమీద నాకెంతో అభిమానంగా వుండేది. అహర్నిశలూ వాళ్ళతోనే గడిపేవాణ్ణి. ఆ ముప్పైఐదుమందిపిల్లలూ నాపిల్లలే అయినట్లు ఏమిటో విచిత్రమైన భావం వస్తుండేది.

నిజానికి ఆ స్కూలులో నాకు వాళ్లుతప్ప ఆత్మీయులు ఎవరూ లేరు. వియట్‌గారు ఆ చిరునవ్వులో [illegible] నాపై అపారమైన నే[illegible] [illegible]

లని యెంత ప్రయత్నించినా, ఆయన తాలూకు తాళం చెవులు అవి చేసే చప్పుళ్ళతో నన్ను హడలగొట్టి పారేసేవి. ఉద్యోగానికి వచ్చినరోజున తప్ప మళ్లీ ప్రిన్సిపాల్ గారి దర్శనమైనా కాలేదు. పెద్ద హోదాల్లో వున్న ప్రొఫెసర్లకి యీ 'డింభకుణ్ణి' చూస్తే ఆది నుంచీ అసహ్యమే. మానవవిజ్ఞానానికి తామే వారసులమని భావించుకొనే వారిదృష్టికి నేనొక పిపీలికంలా కన్పించానుకాబోలు. పైకి నాతో స్నేహంగా వున్నట్లు నటించి ఎమ్. వియట్ నన్నూ నా సహోద్యోగులనూ శాశ్వతంగా దూరం చేసేశాడు. అతన్ని అసహ్యించుకొనేవారందరూ, నన్నూ అనహ్యించుకొని, నన్నేవిధంగానూ వాళ్లతో కలియనిచ్చేవాళ్లు కాదు. అదీకాక, నేను వచ్చిననాడుతప్ప మళ్లా ఎన్నడూ కేఫ్ బార్ బెట్టీలో కాలు పెట్టకపోవటం, వాళ్ళదృష్టిలో క్షమింపరాని నేరంగా పరిణమించింది.

గేటుకాపరి కసాగ్ని, డాన్సుమాస్టర్ రోజరూ, యిద్దరూకూడా నేనంటే ఎందుకో కొరకొరలాడేవాళ్లు. డాన్స్ మాస్టర్ మరీ ఎక్కువ. నేను ఎదురైనప్పుడల్లా మీసాలు మెలివేస్తూ పత్తికాయల్లాంటి గుడ్లు తిప్పుకొంటూ నావంక చురచుర చూసేవాడు. ఒకానొకసందర్భంలో నేను వినేటట్లుగా, "పితూరీలు చెప్పేవాళ్లంటే నాకు వొళ్లు మంట" అని కసాగ్నితో విగ్గరగా అన్నాడు. కసాగ్ని ఆమాటకి సమాధానం అయితే ఏమీ చెప్పలేదుకానీ, తనకీ అలాంటివాళ్ళని చూస్తే పడదని చూపులద్వారా వ్యక్తం చేశాడు. వీళ్లిద్దరూ ఎవర్ని గురించి మాట్లాడుతున్నట్లు? ఎంత ఆలోచించినా నాకేమీ బోధపడలేదు.

ఎటుచూసినా నిరాదరణ నిర్దాక్షిణ్యభావాలే ఎదురౌతున్నా, గుండెరాయిచేసుకొని మొండిగా బతికెయ్యటం మొదలుపెట్టాను. ఇంటర్మీడియెట్ కుర్రాళ్ళని అజమాయిషీ చేసే యింకోమాస్టారికీ, నాకూ కలిపి మూడోఅంతస్థులో ఒక గది యిచ్చారు. ఆ మాస్టారు మేలుకొనివున్న గంటల్లో ముప్పాతికభాగం కేఫ్ బార్ బెట్టీలోనే గడిపేసేవాడు. తత్ఫలితంగా రూములో ఎప్పుడుచూసినా నేనొక్కణ్ణే వుండేవాణ్ణి.

స్కూలునుంచి రాగానే గది తలుపు గడియ పెట్టేసి నా బట్టలపెట్టెని డెస్కుదగ్గరకు లాగి పుస్తకాలు ముందు పడేసుకొని ఒక్క ఘడియైనా వృథా చేయకుండా చదువుకు వుపక్రమించేవాణ్ణి.

అది వసంతకాలం. చదువుకొంటూ తలెత్తి చూస్తే కిటికీలోంచి ఎత్తుగా నీనీలాకాశం, దృగంత రేఖవరకూ ఆకుపచ్చని శాల్వా కప్పినట్టున్న పృథ్వీతలమూ కనిపించేవి. ఉండీ వుణిగీ పక్కగదుల్లో పాఠాలు వల్లెవేస్తున్న విద్యార్థికంఠస్వరమో, విద్యార్థులను మందలిస్తున్న వుపాధ్యాయుని మేఘగర్జనమో వినిపించేవి అప్పుడప్పుడూ గూళ్ళల్లో పిచ్చికలు పోట్లాడుకొంటూ కిచకిచలాడేవి. మళ్లీ అంతలో ఎప్పటిలా నిశ్శబ్దం ఆవరించేది. పరిసరాలన్నీ నిద్రలో మునిగిపోయేవి.

లోకమంతా ఆవిధంగా గాఢసుషుప్తిలో మునిగి వుండగా యీ డింభకుడొక్కడే మేల్కొని వుండేవాడు. మేల్కొని బుర్రబద్దలయ్యేటట్లు లాటిన్ గ్రీకు భాషలు చదువుతూ కూర్చునేవాడు.

వీడీవిధంగా వూపిరైనా సీల్చుకోకుండా బాగుపడే కార్యక్రమంలోపడి కొట్టుకొంటూవుండగా, వెనుకటి కవితాకన్యక ఒక్కొక్కరోజువచ్చి, వీడిహృదయ కవాటంముందు నిలిచి, తనను లోనికి రానిమ్మని అతి దీనంగా ప్రార్థించేది.

కవితాకన్యలతో కులుకుతూ కూర్చోవటానికి యీ డింభకుడి కిప్పుడు టైంలేదు.

ఎప్పటికైనా వుద్యోగంలో పైమెట్టుకి పోవాలంటే వెంటనే యీ పుస్తకాలన్నీ చదివి, పరీక్షకు కూర్చుని డిగ్రీపొందితీరాలి. అప్పుడుకదా తాను తన కుటుంబాన్ని ఒక్కచోట చేరదీసి, యిల్లూ వాకిలీ ఏర్పరచగలిగేది!

నేనుపడే యీ కష్టమంతా, అనుభవిస్తున్న యీ చిదరఅంతాకూడా కేవలమూ మాకుటుంబాన్ని వుద్ధరించటానికే నన్న విషయం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా, నా జీవితానికి ఒక అర్థం ఒక ప్రయోజనం వున్నాయనిపించేది. ఆగదినీ, ఆగదిలో నేను గడిపిన జీవితాన్ని తలుచుకొంటే యిప్పటికీ వొళ్లు పులకరిస్తోంది.

(ఇంకావుంది)

# బుద్ధిబలం - చేతిబలం

కొంపల్ల బ్రహ్మానందరావు

రోహిణీకార్తె ఎండలు ధుమాయించి కొట్టొస్తున్నాయి. వేడి గాలి ఈ చెవినుంచి ఆ చెవికి సోకుతూంది. ఎక్కడవాళ్లు అక్కడ ముగ్గి కూర్చుంటున్నారు. మేముకూడా ఇంట్లో తలుపులన్నీ బిడాయించి వక్కాణికేసిన పళ్లమాదిరి అణిగి మణిగి ఊపిరాడక పడివున్నాం. "శెలవల్లో ఊరికే కూర్చోకపోతే ఏదైనా పని కల్పించుకోకూడదటే" అని అమ్మ కేకలేసేసరికి ఏబుద్ధి పుట్టిందో నాల్గురోజులు క్రితం బావ తెచ్చిన రంగుకాగితాలు అన్నయ్య గడ్డంపెట్టెలోంచి మిసాలకత్తెరపట్టుకొచ్చి ముందేసుకునికూర్చున్నాను. తరువాత చెల్లెలూ, తమ్ముళ్ళిద్దరూ ఉత్సాహంగా ఎదురుగావచ్చి చతికిలపడ్డారు నేను చేసేపనికి అర్థంగాక. "నాకూ చెప్పవూ?" అంటూ, అసలు భడవ వచ్చింది. "చెప్పే దేముంది చూడవే!" అన్నాను కాగితాన్ని కత్తిరిస్తూ.

అందరూ నాచుట్టూ చేరి వింతగా చూస్తున్నారు. నవ్వుతున్నారు నేను చేసేపనికి. నాల్గుగంట లయ్యేసరికి రకరకాల బొమ్మలు తయారు చేశాను చక్రాలు, నక్షత్రాలు, డైమండు షేపులూ. ఈమాదిరిగా కత్తిరింపులు కుదుర్తాయని నేను ఎన్నడూ అనుకోలేదు. తగువిధంగా అమర్చి అందర్ని చూడమన్నాను. చుట్టూవున్న పిల్లజనాభే కాకుండా పెద్దజనాభాకూడా వచ్చి చూసి విస్తుపోయారు. అమ్మవచ్చి, "ఇంత నేర్పు ఎప్పటినుండి వచ్చిందే నీకు?" అని అడిగింది నేను చేసినపనిని ఆశ్చర్యంగా తిలకిస్తూ. "ఇదంతా కొత్త కాదు. నాకు మొదటినుంచీ వచ్చునమ్మా" అన్నాను కొంచెం పైకెక్కి. "ఏడశావు. నాకు తెలీదూ!" అంది అమ్మ. "అయితే ఇవి నేను తయారు చేసినవి కాదంటావా?" అన్నాను. "కావని ఎలా అనను? కళ్ళముందు కత్తిరిస్తూంటే!" అంది అమ్మ. "అయితే ఏమిటి?" అన్నాను.

"ఇంత బాగా చెయ్యటం ఎలా నేర్చావూ?" అని అడుగుతున్నాను. "నాల్గయిదుసార్లుచేస్తే అదే చాతనవుంది" అన్నాను నేను.

"అబ్బే ఏం చేతకాదు" అని ఎకురంది అమ్మ. నాకు ఆశ్చర్యంవేసింది అమ్మమాటలు వినేసరికి. చిన్నపిల్లమాదిరిగా అర్థంలేకుండా అమాయకంగా అంటూన్నందుకు.

"అలా అంటావేమిటి?" అని చిరుకోపంతో అన్నాను. ముఖం చాటుగా త్రిప్పి కన్ను సౌంజ్ఞ చేసింది. ఎందుకలా అమ్మ ప్రవర్తిస్తున్నదో నాకు గోచరం [illegible]. "మళ్ళీ చేసిచూపెట్టూ ఆ [illegible] కత్తిరింపు" అంది.

నీలంరంగు కాగితం [illegible] దేవుడా, అంటూ లేని ఓపి[illegible] కుని మళ్ళీ విమానంలోని భాగమూ కత్తిరించటం [illegible]భించాను. అడిగిందేకానీ [illegible] నాకేసికానీ, విమానంకేసికానీ ప[illegible]క్షగా చూడటం లేదు.

"చూడమ్మా మరి!" అన్నాను క్రిందపడ్డ కత్తెరను తీసుకుంటూ, "నేను చూస్తున్నను కానీ [illegible] చూస్తూవుండండ్రా పిల్లలూ! [illegible]

ఎలా చేస్తూందో వదిన. అంది అమ్మ పేంకుర్చీ జరుపుకుంటూ.

పిల్లలందరూ మరీ దగ్గరకు జరిగి కూర్చున్నారు. అందరూ చాలా జాగ్రత్తగా పరీక్షిస్తున్నారు. అందుట్లో మరీ శంకరం, గోపీ చాలా ఆశగా చూస్తున్నారు.

దాదాపు గంటకు పూర్తయింది నేలమీద తిరగలేని విమానం. అంటే అది బొమ్మ విమానమేగా!!

"చల్లబడ్డట్టుంది. తలుపు తీయవే" అన్నాను.

విసుగు పుట్టుకొచ్చి, అమ్మ లేచి వచ్చి "ఏమర్రోయి! అది చెయ్యటం మీరూ చూశారుగా!"అంది.

'ఓ' అన్నారు ఏకకంఠంతో, పెద్దమనుషులు చిత్రంలోమాదిరి.

"అయితే, రేపు మీరూ ఆ విమానంలాంటిది మరొకటి చేసి చూపెట్టాలి. ఎవరిది బాగుంటే వాళ్లకి ఫస్టుప్రైజు. తెలిసిందా?" అంది. 'ఓ' అన్నారు అందరూ.

తరువాత చాటుకి పిల్చి చెప్పింది అమ్మ. "అలా అంటేగానీ పిల్లలకు ఉత్సాహం రాదు. ఉత్సాహంవస్తే కానీ చెయ్యరు. లేకపోతే ఎండకు చెడాభడా తిరుగుతారు. చేస్తూన్నపుడు ఒకటికి రెండుసార్లు చూడ్డానికి నిన్ను మళ్ళీ విమానాన్ని తయారుచెయ్యమన్నాను," అంది అమ్మ.

"ఓహో! అందుకా!" అన్నాను నవ్వుతూ.

ఎక్కడ సంపాదించారో ఏమో నల్గురూ సంపాదించారు నాల్గు చిన్న కత్తెరలు. తలా నాల్గు రంగుకాగితాలు ఎవరినీ అడగకుండానే పట్టుకెళ్ళారు. ఒక్కొక్కరు ఒక్కొక్కగదిలో కూర్చుని నానాబాధ పడ్డారు. అట్టముక్కలకు పాత ఎక్సర్‌సైజు బౌండుపుస్తకాలు ఉపయోగించారు..

శంకరంగాడు తీసుకెళ్లిన నాల్గు రంగుకాగితాలు చాలక, మళ్ళీ అన్నిసార్లు ఎందుకు తిరగడం అనుకున్నట్టు వున్నాడు అక్కడవున్న కట్ట మొత్తం లాక్కెళ్లాడు ఎవరూ చూడకుండా.

ఇంక గోపిగాడి పని సరేసరి. తీసుకొచ్చిన నాల్గు పేపర్లూ నాల్గు వేల తుంపులు తయారుచేసి కూర్చున్నాడు అసమర్థుడివలె.

సత్యవతిమాత్రం ఇంకా బాధపడ్తోంది. దానికి చూడబోతే చేతవునట్టుగానేవుందిధోరణిచూస్తే. నిముషానికొకసారి ముక్కు తుడుచుకుంటూ వచ్చిచూచి వెళ్తోంది నేను చేసిన విమానాన్ని.

పోతే హైమవతి పని చాలా బాగుంది. పూర్తిగా నేను చేసినట్టుగా కాకపోయినా, చాలాబాగా కుదిరింది విమానం. కానీ పని ఆలస్యంగా అవుతూంది. కారణంఅడిగేసరికి మొహంమీద పడ్తూన్న జుత్తు కారణమంది. ఎన్నిసార్లు అని తీసుకుంటుంది పాపం!

పాపం అందరిలోకి చిన్నది లక్ష్మికి ఏమి చేతకాక, కత్తెరను ఎలా పట్టుకోవాల్సిందీ తెలియక తికమకలాడుతోంది.

సాయంత్రం అయ్యేసరికి అమ్మ ఆర్డరిచ్చింది అందర్నీ పట్టుకురమ్మని. ఒక్కొక్కళ్ళే తెచ్చారు. ఇకచూడండి! "నా విమానం ఎగిరిపోయింది"అంటూ ఎగుర్తూవచ్చాడు శంకరం. అమ్మ వాడికేసిచూసి "ఏదిరా నీ విమానం?" అంది. "ఎగిరిపోయిందన్నానుగా" అన్నాడు నవ్వుతూ. అమ్మకు అర్థమయింది వాడి శక్తి.

గోపివచ్చి నాల్గువేల తుంపులు ముందుపోసి ఏడ్పుమొహంపెట్టాడు. అమ్మచూసి నవ్వింది.

ఇక సత్యవతి, హైమవతి ఇంచుమించు నేను చేసినట్టుగానే చేసిపట్టుకొచ్చారు. అమ్మ వాళ్లిద్దరి పనితనానికి మెచ్చుకుని ఫస్టుప్రైజు ఇద్దరికీ పంచింది.

ఇంతలో అన్నయ్య వచ్చాడు. అమ్మ వాణ్ణిపిల్చి, "చూశావట్రా! ఆడపిల్లలు నేర్పరులో, మగపిల్లలు నేర్పరులో? కాదంటివే!" అంది.

అన్నయ్య పరికించిచూసి "నీదే రైటు అమ్మా" అన్నాడు ఒప్పుకుంటూ.

"అందరూ ఒకే ఈడువాళ్లే! కానీ ఆడదానిలో ఈ నేర్పు ఎక్కువరా అబ్బాయి. ఇప్పటికయినా రుజువయిందా?" అంది.

అమ్మకూ, అన్నయ్యకూ రెండు రోజులక్రిందట ఈ విషయంలో వాదం జరిగిందట. అందుకు అమ్మ ఈవిధంగా ఋజువు చేసింది.

అన్నయ్య వెళ్తూ, "ఆడపిల్లలకి చేతిబలం ఎక్కువయితే, మగపిల్లలకి బుద్ధిబలం ఎక్కువ" అన్నాడు. అమ్మ నవ్వింది.

ఇంతలో బావా, చిన్నన్నయ్యా వాళ్ళొచ్చారు తమ మీసాల కత్తెరలు మాయమయ్యాయి అంటూ.

ప్రతిగదిలోకివెళ్లి తెచ్చిఇచ్చాను కత్తెరలను. అసలు కారకురాలు నేనేగదా మరి!!

# బాబు బుద్ధిమంతనం

వాళ్ళమ్మ బెత్తం అట్టే పెట్టి మరీ పని చేసుకోవటం మొదలు పెట్టింది. వెధవ! మరీ ఆకతాయి అయిపోతూన్నాడు. చక్కగా నీళ్లుపోసి, ఎంచక్కా బట్టలు తొడిగి, మొఖానికి పౌడరుపూసి ... పాపిడిదువ్వి... ......ఇంత చేస్తుంది వాళ్ళమ్మ! వాడి అందం చూసి మురిసిపోతుంది! అయితే ఏం! తుర్‌మని వీధిలోకి పోతాడు. బట్టలన్నీ మాపుకొస్తాడు. అప్పుడే ఏదో సాహస కార్యం సాధించిన వీరునిలా పోజు పెట్టుకొని వస్తాడు యింటికి. చెప్పొద్దూ! వాళ్ళమ్మకు ఎక్కడలేని కోపం వస్తుంద. "వెధవ! వీపు చీరేస్తా" అని అమాంతం కొట్టేంత పనిచేసి కొట్టలేక ముద్దెట్టుకొంటుంది! చివరకు బుల్లిబుల్లి మాటల్తో కుఱ్ఱాడ్ని అనుకరిస్తూ చెబుతుంది.

"తప్పుకాదురా బాబూ! బట్టలు మురికి చేసుకోవచ్చునా" అని. అవి తీసివేసి మరో బట్టలు వేస్తుంది "అబ్బ! నేను వేగలేనురా బాబూ"... అదో పాట అయిపోయింది ఆమెకు. వెధవ! చేసే ప్రతిపనీ ఏదో సాహస కార్యమాయెగా మరి! మొన్న వాళ్లనాన్నగారు టైంపీసు క్రొత్తది పట్టుకొచ్చి టేబిల్ మీద పెట్టడం చూశాడు బుగ్గను వ్రేలు పెట్టుకొని మరీ!

అది టక్ టక్ మని కొడుతుంటే దానికి పాఠం నేర్పాలనుకొన్నాడు. గబగబా నాన్నారి చేతికఱ్ఱ తెచ్చి ఒక్క మొట్టికాయ వేశాడు గడియారం నెత్తిమీద. అది క్రిందపడి ముక్కలుముక్కలై కూర్చుంది. టక్ టక్ మని అనటం మానేసిందనే సంతోషంతో పోజు పెట్టాడు బాబు. ఆ చప్పుడుకు వాళ్లమ్మ వచ్చి చూస్తే రెండు చేతుల్తో చప్పట్లు చరవటం మొదలుపెట్టాడు. "ఓరి భడవా!" అంటూ వీపుమీద ఒక్కటి వేసింది వాళ్లమ్మ. పగిలిపోయి దిక్కులు చూస్తూన్న గడియారాన్ని చూపిస్తూ "మరి అది తక్ తక్ మని గోల చేస్తుందే" అని బావురుమన్నాడు

కొమర్రాజు ప్రసూనాంబ

వాళ్లమ్మను కావిలించుకుంటూ. "మా నాయనే ... మా బాబే ... ఊరుకో బాబూ. మాయదారిదాన్ని కొట్టాను" అని వాళ్ళమ్మ అమాంతం హృదయానికి హత్తుకొని ముద్దులు కురిపించేసింది. వాడి అఘాయిత్యం కాకపోతే మరేమిటి?! మరొకసారి యిలానే నాన్నగారి కొత్త గ్లాస్కో పంచె ఆరకట్టిఉంటే దీపంబుడ్డీ దగ్గరగా పెట్టి మరీ చూస్తున్నాడు దాని అంచుల్ని. వయ్యారంగా వంపులు తిరుగుతూ దాన్ని తిలకిస్తుంటే అంతపనీ అయింది! పంచె కాస్తా అంటుకొని కాలిపోతూంటే వాళ్లమ్మే వచ్చి గబగబా ఆర్పేసింది మంటల్ని. అమాయకంగా గుడ్లు మిటకరిస్తూ కూర్చున్నాడు బాబు అంతా చూస్తూ. వాళ్ళమ్మకు ఏంచేయాలో అర్థం కాలా బాబు ముఖం చూచి. ఆ ముఖంలో ఏదో జ్యోతి ఉందటుంది వాళ్ళమ్మ. చేరడేసి కళ్లు, చిన్నముక్కు, సొట్టపడే బుగ్గలు చూస్తుంటేనే చాలు వాళ్లమ్మకు. ఏదో ఒక సాహసం చేస్తాడు. గప్‌చుప్ సంబారు బుడ్డీలా కూర్చుంటాడు. చేతులెలావస్తాయి వాళ్లమ్మకు కొట్టేందుకు! చిదిపితే పాలుకారే బుగ్గలు మరీ ఉబ్బించి పోజు పెడ్తాడు. అప్పుడు వాళ్ళమ్మకనుక చూస్తే వాడిపై అమాంతం వెళ్ళి ముద్దుల్లో ముంచేస్తుంది.

బాబు బయటకు పోయాడూ అంటే ఏదో ఒక ఘనకార్యం చేశాడే! విచిత్రమేమంటే ఎవర్నీ ఏమీ అనడు! ఎవరైనా ఏ [illegible] నైనా అన్యాయంగా కొడ్తున్న [illegible] తోస్తే వాడిమీద పడి ముష్టి [illegible] చేస్తాడు ఆర్తత్రాణపరాయణు [illegible] తానే గెలిచి పాప మా వ్యధితు [illegible] రక్షించే స్థితిలో ఉంటే వీరకువా [illegible] రునిలా దుమ్ము కేగిన గుడ్డలతో యింట్లోకి ధైర్యంగా వస్తాడు అమ్మకెదురుగా! ఓడిపోయిన [illegible] తే పాపం మెల్లగా, పిల్లిలా అమ్మకు కనిపించకుండా యింట్లోకి పోయి ఏమంచం క్రిందనో జేరి విచారిస్తు



న్నట్లు కూర్చుంటాడు వాళ్ళమ్మా నాన్నా వెతుక్కుంటూవచ్చేవరకు.

వీడు ఎంత ఆర్తత్రాణపరాయణుడంటే, ఒకనాడు జరిగిన విశేషం భలే గమ్మత్తుగా ఉంటుంది. పక్కింటి నారాయణరావుగారు వాళ్ల బ్బాయినిపట్టుకొని అదేపనిగా బాదుతున్నారు. అదైనా యింట్లో జరిగితే బాగుండేది. కాని వీధిలోనే ఉందిగా యిల్లు. ఆడుతూ ఆడుతూ ఉన్న పసికాయని పట్టుకొని వాళ్ల నాన్న అలా కొడుతుంటే అప్పుడే నీటుగా తయారైన మనబాబు సహించలేకపోయాడూ అంటే నమ్మండి. పెద్దగా ఆలోచించి ఒక కంకరరాయిపట్టుకొని వాళ్ల నాన్న నుదురుమీద సరిగా గురిచూసి కొట్టాడు. "అమ్మో!" అనుకుంటూ అలా గుడ్లు వెళ్లబెట్టాడు పాపమా పెద్దమనిషి పదినిముషాలవరకు. చూస్తే యీ డింభకుడు ఆ శేళ్లకుట్టి వెధవ. అంత పెద్దమనిషిని అమాంతం కొట్టేశాడు. అయితే ఏం వాడి సంతోషం ఏమిటంటే అంతటి పెద్ద రాక్షసుని చేతులో పాపం తనలాంటి చిన్నకుఱ్ఱాడు దెబ్బలు తింటూంటే తానొక్కడై రక్షించగలిగాడన్న సంతోషం బాబుని ఉక్కిరి బిక్కిరి చేసిందనుకోండి. ఠీవిగా, గర్వంగా యింట్లోకిపోతూంటే వాళ్లమ్మ చెవి మెలేసింది సంగతులు తెలుసుకొని.

సరిగ్గా యించుమించు అలానే జరిగింది యీ రోజు కూడా! చెప్పొద్దూ! అప్పుడే నిండుచంద్రుడిలా ముస్తాబై వీధిలో బొంగరం పట్టుకొనినిలబడ్డాడు. ఏదోఅయింది. బహుశా ఏ ఆర్తనాదంవినిపించిందో ..."సిరికిన్ జెప్పడు..." అన్నట్లు ఆ బొంగరంకూడా వదిలేసి అమాంతం రోడ్డుకు అడ్డంగా పరుగెత్తాంటే చిన్నకారు ఒకటి వచ్చి సడన్ బ్రేకులు వేసుకొని ఆగిపోయింది. ఎంతగండం గడిచింది. డ్రైవరు క్రిందకు దిగి బాబుని పట్టుకొని బరబర లాక్కొచ్చాడు యింటికి. వాళ్లమ్మ బాబును గట్టిగా కావలించుకొని కాస్సేపు శోకాలు తీసింది. ఏవేవో దిగదుడుపులు తీసి పారేసింది. బెజవాడ కనకదుర్గమ్మకు పెద్దపెద్ద నమస్కారాలు పెట్టింది. ఇంతా అయినా బాబు

# ★ బాబు బుద్ధిమంతనం

ఏదో విచారంగా ఉన్నాడు. వాళ్లమ్మ పాపం ఏమీ అనలేదు కూడాను. అందులో పైగా వెండి గిన్నెలో పాలన్నం కలిపి తినిపిస్తుంటే ఒక్క మెతుకుకూడా సహిస్తే ఒట్టు! వాడికి ఆ దృశ్యం మరపు రావటం లేదు. ఎంతసేపూ ఆ ఆర్తు డెవరో పాపం మరో రాక్షసుని చేతిలో అన్యాయంగా దెబ్బలుతింటున్నట్లు, తనని రక్షించమని వేడుకొంటున్నట్లు, తనేం చేయలేక పోతున్నట్లు ఊహించుకొంటూంటే వాడికి దుఃఖం గంగానదివరదల్లా వచ్చేసింది.

మళ్లీ బాబు మంచిబట్టలు వేసుకొన్నాడు. వాళ్లమ్మ కనిపెట్టింది ఎట్లైనా పోయే సన్నాహంలో ఉన్న బాబునుచూచి! "ఎక్కడకూ వెళ్లకురా నాయనా"! అని. వింటేనా! ఊహూ!! అందుకే బెత్తం వెతికి అట్టే పెట్టింది మరీను! కొట్టేందుకే!!

అప్పుడే వాళ్లనాన్న ఊరినుండి వచ్చారు. యాపిల్ పండ్లూ మరి... యింకా ఏవేవో చాలా తెచ్చారు. వాళ్లమ్మ బాబుని పిలిచింది. లేండే.




ఎటుపోయాడబ్బా! వాళ్లమ్మకు ఖంగారు ఎక్కువైంది........ ఇందాకనే ఓ గండం గడిచిందా మరి. మళ్ళీ ఎక్కడకోపోయాడు వెధవ. అనుకుంటూ బజారు నాల్గువైపులాచూస్తోంది.

ఇంతలో లోపల ఏదో చప్పుడైంది. నాన్నగారిగదిలో బాబు ఏదో చేస్తున్నాడు.

"ఓరి నీదుంపతెగా నీవిక్కడే ఉన్నావట్రా! అమ్మనీకోసం వెదుకుతోందిరా"...అంటూ వాళ్ళ నాన్న బాబును ఎత్తుకోబోయాడు. కొత్త పార్కరుపెన్ను నాన్నారిది బ్రద్దలై ఉంది బాబు చేతుల్లో. నాన్నగారికి ఎక్కడలేనికోపం వచ్చింది. పైగా బాబుని ఎత్తుకోబోతుంటే సిరా అంతా అయింది బట్టలనిండా.

"ఓరివెధవా"! అంటూ వాళ్లమ్మ దాచిపెట్టిన బెత్తం పట్టుకొచ్చి ఒక్కటి వేశారు బాబు వీపుమీద. ఆదెబ్బకు బాబు గుక్క పట్టి ఏడవటం మొదలు పెట్టాడు. ఆ ఏడుపు విని వాళ్లమ్మ గబగబా వచ్చి అమాంతంఎత్తుకుంది వాణ్ణి. ఆదెబ్బ ఎంత గట్టిగా తగిలిందో కాని పాపం బాబు చాలసేపు ఏడ్చాడు. వాళ్లనాన్నగారుకూడా ఎంతో నొచ్చుకున్నారు. కాస్సేపటికి బాబూవళ్లుకాల్తోంది. ఆయనతో చెప్పింది వాళ్లమ్మ ఖంగారుపడుతూ. బాబు బెడ్ మీద పడుకొన్నాడు. వాళ్లనాన్న టెంపరేచరుచూచారు.

పాపం వాళ్లనాన్నా అమ్మా రెండువైపులా కూర్చొని ఖంగారు పడుతూనే ఉన్నారు. వాళ్లమ్మ బార్లీ కాచి యిచ్చింది. త్రాగనే లేదు బాబు.

ఆ రాత్రంతా ఉలిక్కిపడుతూనే ఉన్నాడు బాబు. రాత్రి తెల్లవారులూ ఎవరికీనిద్రలేదు. ప్రొద్దునే లేచి వాళ్లమ్మ బార్లీ కాచి యిచ్చింది. బాబు కాస్త గుటక వేశాడు యీసారి. కాస్సేపటికి బాబూ ముఖమంతా చెమటతో తడిసిపోయింది. బాబు జ్వరం కాస్త తగ్గేసరికి ఎంతో సంబరపడింది వాళ్లమ్మ. సాయంత్రానికి పూర్తిగా తగ్గిపోయింది జ్వరం. వాళ్లమ్మ సంతృప్తితో వంటింట్లోకిపోయి అన్నం వండుతూంది.

"అమ్మా! ఇదిగోనే యాపిల్ పండు" అంటూ అమ్మకు అందిస్తూన్నాడు బాబు తను తింటూన్న పండును...వాళ్లమ్మ మా నాయనే అంటూ దగ్గరకు తీసుకొని ముద్దు పెట్టుకొంది. విశేషమేమంటే ఆనాటినుండి బాబు ఎంతగా మారిపోయాడనుకున్నారూ. చక్కగా అమ్మదగ్గరే కూర్చోవడం మొదలుపెట్టాడు. ఎక్కడికీ పోడు ఏ చిలిపిపనులూ చేయడు. బాబు ఎంత బుద్ధిమంతుడయ్యాడనుకున్నారు!

బాబు యీమధ్య స్కూలుకు వెళ్తున్నాడు. పుస్తకాలు చంకన పెట్టుకొని రోడ్డు ప్రక్కగా నెమ్మదిగా వస్తుంటే చూచాను. ★

# ఇటాలియన్ చిత్రాలు

## ఇల్యా ఎహ్రెన్‌బర్గ్

[యుద్ధానంతరం ఇటాలియన్ చిత్రాలు సంఖ్యలో తాకపోయినా, అంతకంటే ముఖ్యమైన ప్రతిభలో, ప్రపంచంలో అగ్రస్థానం వహించాయి. ఫాసిస్టు పరిపాలననుంచి ప్రజలు విముక్తులుకాగానే, అణచిపెట్టబడిన సృజనశక్తులన్నీ ఒక్కసారిగా పెల్లుబికివచ్చినట్లు తోస్తుంది. ఈ చైతన్యం సినిమారంగంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. రాబర్టో రోజెలినీ 1945 లో తీసిన "ఓపెన్ సిటీ," 1946 లో తీసిన "పైజన్" చిత్రాలు ఈ చైతన్యానికి ప్రారంభచిహ్నాలు. మొదటి చిత్రం జర్మన్ ఆక్రమణక్రింద నలుగుతున్న ఇటలీ ప్రజలను, రెండవచిత్రం విముక్తిసమయంలో ఇటలీపరిస్థితినీ యథాతథంగా, గొప్ప వాస్తవికతతో చిత్రించాయి. సినిమాచరిత్రలో ఇవి ఒక నూతనశకాన్ని ప్రారంభించాయి.

ఆ తరువాత వెలువడిన గొప్ప ఇటాలియన్ చిత్రాలనుగూర్చి ప్రసిద్ధ సోవియెట్ రచయిత ఇల్యా ఎహ్రెన్ బర్గ్ ఈ వ్యాసంలో వ్రాశాడు.]

గడిచిన కొద్ది సంవత్సరాల్లో నేను 11 ఇటాలియన్ చిత్రాలు చూశాను. వీటిలో బైసికల్ థీఫ్, రోమ్ లెవెన్ ఓ క్లాక్, మిరకిల్ అఫ్ మిలాన్ నన్ను చాలా ఆకర్షించాయి. పాత్ అఫ్ హోప్, షూ షైన్, టూ పెన్నీవర్త్ అఫ్ హోప్‌వంటి చిత్రాలు చక్కగా ఉన్నాయనిపించాయి. నో పీస్ అండర్ ది ఆలివ్స్, ది మిల్ ఆన్ ది పో మొదలైన చిత్రాలు అంత బాగా లేవనిపించాయి. కాని మొత్తం ఇవన్నీ కలిసి ఇటాలియన్ సినిమారంగానికి విశిష్టత సాధించిపెట్టాయని మాత్రం చెప్పక తప్పదు. ఈచిత్రాలు నన్ను ప్రేక్షకునిగా కదిల్చివేశాయి. వాటిలోని కథానాయకుల కష్టసుఖాల్లో నేను కూడా పాలొన్నట్లు చేశాయి. ఇంతేగాక, సినిమాకళయొక్క కొన్ని ప్రత్యేకలక్షణాలనుగూర్చి నాలో ఆలోచనను రేకెత్తించాయి.

ఫాసిజం పతనం కాకముందు ఇటాలియన్ సినిమాకళ హీనస్థితిలో ఉండేది. తళుకు బెళుకులు, చవకబారు ఆకర్షణలు మాత్రమే కలిగి, అవాస్తవికంగా, వికారపూరితమై ఉండేది. చిత్రవిచిత్రమైన అలంకారాలు చేసుకున్న "తారలు", వికారచేష్టలు



అలెగ్జాండర్ మార్కే (హాలీవుడ్) ఇండియాలో నిర్మిస్తున్న "గాంధీపథ్" లో బాబూ రామ నారాయణసింగ్ (పార్లమెంటు సభ్యుడు), బాల నటుడు ప్రేమ్. ➔



"మాగోపి" లో వెంకటేశ్వర్, జి. వరలక్ష్మి.

# ★ ఇటాలియన్ చిత్రాలు ★

చేస్తూ తెరమీద తిరిగేవారు. ఎక్కువగా చరిత్రాత్మక చిత్రాలు తయారయ్యేవి. కాని అవేవీ ఎవరినీ ఆకర్షించలేదు.

యువకులైన ఇటాలియన్ దర్శకులు— విట్టోరియా డీసికా, రోజెలినీ, డీశాంటిస్, లట్వాడా మొదలైనవారు — మొదటి రోజుల్లో చాలా ఇబ్బందుల నెదుర్కోవలసివచ్చింది. ముఖ్యంగా తమ దేశపు సినిమాకళకు సరియైన సంప్రదాయాలు లేకపోవడంతో, పునాదులదగ్గిర్నించీ తామే త్రవ్వుకొని కట్టడం నిర్మించవలసి వచ్చింది. కాని ఇలా పునాదులనుంచీ ప్రారంభించడం వల్లనే, వారి శక్తి ఇనుమడించిందని నా అభిప్రాయం. సినిమా ఒక క్రొత్త కళ. అది నాటకరంగస్థలంగాని, చిత్రకారుని చిత్రఫలకంగాని కాదు. ఈ క్రొత్తకళలో ముందుకువేసే ప్రతి అడుగూ ఒక క్రొత్త విషయాన్ని బయటపెడుతుంది. బహుశా ఈకళలో పనికిరాని పాత సంప్రదాయాల ననుసరించేకంటె, ఏ సంప్రదాయాలూ లేకుండా పనిచేయడమే తేలికనుకుంటాను.

ఇటాలియన్ సినిమాలలో ముందుగా మన దృష్టిని ఆకర్షేది, వాటి వాస్తవికత; మనం తెరమీద చూసేది యథార్థ జీవితమేననే భావం. ఒక్కొక్కసారి మనం చూసేది కల్పితకథాచిత్రం కాదనీ, డాక్యుమెంటరీయే ననీకూడా స్పష్టమైన భావం కలుగుతుంది. ఇతివృత్తంలో కాని, నటనలో కాని, నాటకీయ లక్షణాలేమీ ఉండవు. నిజంగా జరిగిన సంఘటనలనే కెమెరామాన్ ఫొటోగ్రాఫ్ చేస్తున్నా డనిపిస్తుంది.

నాటకం గొప్ప కళకాదని నేననడం లేదు. నా చిన్నతనంలో మేరియా రొమిక్కలోవా, ఎలియనోరా డూస్, వేరా కొమిస్సార్ జెవ్స్కాయా, యువకుడైన స్టానిస్లావ్స్కీ, మోనేసలీ మొదలైనవారి అభినయప్రాగల్భ్యం చూసి పరవశుణ్ణయేవాణ్ణి. నాటకకళ చాలా ప్రాచీనమైనది. దాని సంప్రదాయాలు కొన్ని శతాబ్దాలనుండీ రూపొందుతున్నాయి. ఈసంప్రదాయాలు మనకు చిన్నతనంనుంచీ అలవాటైపోయి ఉంటాయి. ఒక గొప్ప నటుడు రంగంమీద 'స్వగతం'గా మాట్లాడుతూఉంటే మనం అణువణువునా పంచలించిపోతాము. స్వగతంగా మాట్లాడడం అసహజమనీ, పిచ్చివాళ్ళు తప్ప మరెవరూ తమలోతాము బిగ్గరిగా మాట్లాడుకోరనీ అభ్యంతర పెట్టేవాడు బాగా మందబుద్ధి అయివుండాలి. నాటకరంగంమీద 'సహజం'గా ఉండాలని ప్రయత్నించడం అభినయకళకు సంకెళ్లు వేయడమేకాక ప్రేక్షకునికి చిరాకుకూడా కలిగిస్తుంది. రంగస్థలంమీద నిజమైన చెట్లు, గుర్రాలు ఎవరికి కావాలి? నటులు రంగంమీద నిజమైన టీ త్రాగుతున్నారో లేదో ఎవరికి పట్టింది? రంగస్థలంమీద ఫుట్‌లైట్లూ, సెటింగులూ, నటుని కంఠస్థాయీ,



అశోకా పిక్చర్స్‌వారి "ఎన్ మగళ్" తమిళ చిత్రంలో ఎస్. వరలక్ష్మి.



# ఇటాలియన్ చిత్రాలు



నాటకకథాగమనం — అన్నీ సాంప్రదాయికమైనవేతప్ప సహజమైనవి కానే కావు. షేక్‌స్పియరు సమకాలికులు వ్రాసిన గ్రంథాలు ఈనాటికీ కొందరు చదివేవాళ్ళుండవచ్చు. కాని అవి ఎవర్నీ ముగ్ధులను చేయలేవు. షేక్‌స్పియర్ నాటకాలు మాత్రం ఇప్పటికీ రంగస్థలంమీద సజీవంగానే ఉన్నాయి. పుస్తకంలో అసహజంగా, అతిశయోక్తులుగా, అసంభవంగా కనిపించేవన్నీ రంగస్థలంమీదికి మారేటప్పటికి సహజమనే భ్రాంతి కలిగిస్తాయి.

ఇటాలియన్ చిత్రాలు నాటకరంగం నుంచి ఎరువు తెచ్చుకోకుండా స్వతంత్రపంథా తొక్కాయి. అందుచేతనే వాటిలో ఒక ప్రత్యేకత, బలం కనిపిస్తాయి. ఇటాలియన్ దర్శకులు నాటక రచయితల, నాటక నటుల సహాయం స్వీకరించరు. స్క్రిప్టు రచయితలు తమ కథలు తామే వ్రాస్తారు; లేక నవలలను, ఇతర కథలను ఆధారం చేసుకుంటారు. రంగస్థలంకోసం ఉద్దేశించబడిన నాటకం తెరకు పనికిరాదు. నాటక రచయిత చాలా పరిమితమైన స్థలాలను, దృశ్యాలను, తక్కువమంది పాత్రలను దృష్టిలో పెట్టుకుని నాటకం వ్రాస్తాడు. నాటకకథ కొన్ని నిర్దిష్టసూత్రాల ప్రకారం జరగాలి. నవలా రచయితగాని, కథారచయితగాని ఇష్టం వచ్చినన్ని పాత్రలను ప్రవేశపెట్టవచ్చు. ఒక ఇంటి నుంచి వీథిలోకి, వీథిలోంచి ఇంటికి, ఒక నగరంనుంచి మరో నగరానికి స్థలాన్ని మార్చవచ్చు. నవలలో కథాగమనం జీవితంలో జరిగే పద్ధతికి చాలా సన్నిహితంగా రావడానికి వీలుంది. నాటకం అలాకాదు.

ఇటాలియన్ చిత్రాల్లో జీవితంలోని ఏ చిన్న వివరమూ వదిలిపెట్టబడదు. టెక్నిక్ విషయంలో డైరెక్టర్లు స్టూడియో సెట్లకోసం ఎగబడక సాధారణంగా యథార్థ దృశ్యాలనే తీసుకుంటారు. దీనివల్లకూడా ఈ చిత్రాలకు ఒక విచిత్రమైన విలక్షణత కలుగుతున్నది. ఉదాహరణకు, మంచి ఫ్రెంచి చిత్రాలలోకూడా లైటింగ్ ఎఫెక్టులు వగైరా కృత్రిమత్వం కావలసినంత కనిపిస్తుంది.

అన్నిటికంటే ముఖ్యంగా, ఇటాలియన్ నటులు రంగస్థలంమీద మల్లే మాట్లాడరు. నిత్యజీవితంలో మనకు అప్రయత్నంగా వినిపించే సంభాషణల మోస్తరుగానే, ఆ చిత్రాల్లోని సంభాషణలుకూడా చిన్నవి, [illegible]పు, కల్పిగి అర్థవంతంగా ఉంటాయి. 'బైసికిల్ తీఫ్' లో తండ్రి మీద కోపంవచ్చిన కుర్రవాణ్ణి జ్ఞాపకం చేసుకోండి. లేకపోతే 'రోమ్ లెవెన్ ఓ క్లాక్' లో దాసీదాని ప్రేమకథను చూడండి. ఇటాలియన్ డైరెక్టర్లు సాధారణంగా ఇదివరకెప్పుడూ నటించి ఎరగని మనుషులనే పాత్రధారులుగా తీసుకుంటారు. అంటే నటనానుభవంలేనివాడే ఎక్కువ సహజంగా మాట్లాడగలడని నా ఉద్దేశ్యం కాదు. అనుభవంలేనివాడు బహుశా చేతకాని నటుడని అనిపిస్తేకూడా అనిపించవచ్చు, అయితే అనుభవం ఉన్న నటుడి నాటకపు అలవాట్లను పోగొట్టడంకంటె, కొత్తవాడిని ఉపయోగించుకోవడమే తేలిక.

ఇది టెక్నిక్ సంగతి. ఇక అసలు విషయం. ఇటాలియన్ చిత్రాలకు అంత వాస్తవికత ఎలా కలుగుతోంది? వాటిలో సాధారణ ప్రజలను, వారి కష్టాలను, సుఖాలను, ఆశలను, నిరాశలను మనం చూస్తాము. అసాధారణ మానవులు కనిపించరు. అసాధారణ సంఘటనలు కనిపించవు. కుట్రలు కనిపించవు. మిరకిల్ ఆఫ్ మిలాన్ 'ఫాంటసీ' చిత్రమైనా డీసికా ఇందులో మిలాన్ నగరపు సాధారణ ప్రజలనే చూపించాడు. ఇటాలియన్ చిత్రాలలోని యథార్థ జీవిత చిత్రణను, మానవత్వాన్ని చూస్తుంటే చెకోవ్ కథలు జ్ఞాపకం వస్తాయి.

నేను చూసిన ఇటాలియన్ చిత్రాలన్నీ "సాంఘిక" చిత్రాల కిందికే వస్తాయి. ఒకళ్లో, ఇద్దరో, ముగ్గురో మనుషులను మాత్రమే తీసుకుని వారి సంకుచిత జీవితాలకే ప్రాధాన్యం ఇవ్వడం వాటిలో కనిపించదు. డీసికా, డీశాంటిస్ చిత్రాల్లోని వ్యక్తుల జీవితాలు ఇరుగుపొరుగువాళ్ళ, ఆ వీధిలోవాళ్ల జీవితాలతో పెనవేసుకుని ఉంటాయి. ఈ చిత్రాలు విషాదపూరితమైన నేటి ఇటలీ పరిస్థితులను చూపిస్తాయి. బైసికిల్ తీఫ్, టూ పెన్నీవర్త్ ఆఫ్ హోప్, రోమ్ లెవెన్ఓక్లాక్ చిత్రాల్లో నిరుద్యోగం, పాత్ ఆఫ్ హోప్‌లో పస్తులు, షూషైన్‌లో నిరాశ్రయుల దుర్గతి మిరకిల్ ఆఫ్ మిలాన్‌లో ధనికవర్గాల దోపిడీ, పేద వారిస్థితి ఇవన్నీ కనిపిస్తాయి.

ఇటాలియన్ సినిమాకళలో మరొక విశేషాన్ని పేర్కొనకుండా ఉండలేను. [illegible] చూసిన ఈ చిత్రాలన్నిటిలోనూ రాజకీయాలు కనిపిస్తాయి. వాటి దర్శకులు రాజకీయంగా తమ అభిప్రాయాలు, సానుభూతి ఎటు మొగ్గుతున్నాయో దాచుకోకుండా స్పష్టం చేస్తారు. అయితే వారు కళ యొక్క పరిధులను మాత్రం దాటరు. వారిచిత్రాల్లో మంటెగా రాజకీయప్రచారం చెయ్యడం కనిపించదు. పాత్రల్లో అద్భుతమైన మంచివాళ్ళు, దారుణమైన చెడ్డవాళ్లు కనిపించరు. ఈవిధమైన సంకుచితత్వం ఈ చిత్రాల్లో మచ్చుకైనా కనిపించదు.

పెట్టుబడిదారీసంఘంలో చెడ్డమనుషులు ఎక్కువగా ఉన్నారనికాదు మనం విశదీకరించుకోవలసింది; స్వతహాగా మంచివాళ్లయినవ్యక్తులనుకూడా దుర్మార్గానికి పురికొల్పుతుంది కనుకనే పెట్టుబడిదారీ వ్యవస్థను మనం నిరసించుకోవాలి. బైసికిల్ తీఫ్‌లోగాని, రోమ్ లెవెన్ క్లాక్‌లో గాని విలన్‌లు అసలు లేరు; పోలీసులకు కూడా దయ అంటే ఏమిటో తెలుసు. ఆ చిత్రాలు చూపించే సాంఘిక వ్యవస్థ, ఆ వ్యవస్థకింద పడి నలిగే జీవితాలు మాత్రమే దారుణమైనవి, హృదయవిదారకమైనవి.

ఈ చిత్రాల్లో "నీతిబోధ" కూడా ఏమీ లేదు. "నీతిబోధ" పిట్టకథలకు సరిపోతుంది కాని సినిమాకు కాదు. ఈచిత్రాల్లో తెరమీదికి వచ్చి సంఘాన్ని విమర్శిస్తూ ఉపన్యాసాలుదంచే పాత్రలు లేవు. చిత్రం చూసిన తర్వాత అలా విమర్శించే బాధ్యత ప్రేక్షకుడికే వదిలిపెట్టబడుతుంది.

రోమ్ లెవెన్ క్లాక్‌లో నిరుద్యోగ సమస్య చూపించబడింది. "టైపిస్ట్ కావాలి" అని ఒక ఆఫీసు ఎడ్వర్‌టైజ్ చేస్తుంది. మర్నాడు ఉదయానికల్లా ఆ ఆఫీసు వీథినిండా నిరుద్యోగులైన స్త్రీలు గుంపులు గూడుతారు. ఆ ఆఫీసుభవనం చాలా పురాతనమైనది. మేడమెట్లు తొక్కిడి తాగలేక కూలిపోతాయి. ఒక యువతి గాయపడి చనిపోతుంది. ఇంకా పలువురికి తీవ్రగాయాలవుతాయి. ఈ నింద ఆ భవనం కట్టిన వాడిమీద, ఒక నిరుద్యోగిస్త్రీమీద, ఆఫీసుయజమానిమీద వరుసగా మోపబడుతుంది. కాని ఎవరిమీదా నేరం ఋజువుకాదు. "అయితే నేరం ఎవరిదీ?" అని ఒక జర్నలిస్టు మేజిస్ట్రేటును అడుగుతాడు. దర్శకుడు డీశాంటిస్ తన కథానాయికచేత ఉద్రేకపూరితమైన ఉపన్యాసం ఇప్పించడు. ఆ ప్రశ్నకు సమాధానం చెప్పే బాధ్యత ప్రేక్షకులకే వదిలిపెడతాడు. ఈ పద్ధతివల్లనే ఇటాలియన్ చిత్రాలు జీవితానికి సన్నిహితంగా ఉండడం తటస్థిస్తోంది.

నాటకీయలక్షణాలు నాటకరంగంమీద బాగానే ఉంటాయి. కాని సినిమాకళకు అవి పనికిరావని నా నమ్మకం. హామ్లెట్ చిత్రం నేను చూశాను. లారెన్స

(66-వ పేజీ చూడండి)

# "అగ్గిరాముడు"
## ప్రేక్షకుల అభిప్రాయాలు

అగ్గిరాముడు (ఎన్. టి. రామారావు) దొంగ అనీ, ఖూనీకోరనీ, దోపిడీ దారనీ, పట్నాలు, పల్లెలూ అందరికీ తెలుసు. కాని అతన్ని చూసినవారు లేరు. శారదను (భానుమతి) పెండ్లిచేసికోవాలని ఆమె బావ, వీరరాజు (శ్రీరాం) ప్రయత్నిస్తూ ఉంటాడు కాని శారదకు అతనంటే ఇష్టం లేదు. అందువల్ల ఆమె నెలాగైనా తన దానినిగా చేసుకోవాలని ఒకరోజు అర్ధ రాత్రి అతని అనుచరులువచ్చి శారదను బంధించి తీసుకుపోతారు. దారిలో వారిని అగ్గిరాముడు అటకాయించి వారిబారినుండి శారదను రక్షించి, తన గృహమునకు తీసుక వెళ్తాడు. మరల కొంత కాలానికి శారదను వాళ్లయింటికి రహీము అనే ముసల్మాను గారిద్వారా పంపుతాడు. ఆ సంగతివిని పోలీసు సబ్-ఇన్స్పెక్టరు (ముక్కామల) అతని అనుచరుడు, హెడ్ కానిస్టేబుల్ నంబరు. 441 (రేలంగి) వచ్చి శారదను అగ్గిరాముడి గురించి వివరాలు అడిగి తెలుసుకుంటారు. అప్పుడు శారద తాను రహీం ద్వారా తేబడ్డానని చెప్పుతుంది. దీనినిబట్టి, అగ్గిరాముడికి, రహీంకి ఏదో సంబంధముండి తీరాలని ఇన్స్పెక్టరు రహీంని అగ్గిరాముడి గురించి వివరాలు అడగటానికి వస్తాడు. కాని తను వచ్చినపని కానసాగక పోవుట చేత, "మీలాంటి పేరు ప్రతిష్ఠలుగల ధనవంతులు, అటువంటి ఖూనీదారుతో స్నేహముచేస్తే, మీకు చాలా చిక్కులు వస్తా"యని బెదిరిస్తాడు. అందుకు రహీం మండిపడి, అగ్గిరాముడు దొంగకాడనీ ఇక మీదట అట్లా అన్నఎడల తా నూరుకోనని చెప్పతాడు. అందుకు తగిన సాక్ష్యం చూపితే అతనిమీద కేసులు కొట్టివేస్తానంటాడు, సబిన్స్పెక్టరు. తరువాత అగ్గిరాముడు దొంగకాదనియు, అతను నిరాటంకముగ నలుగురిలోను తిరుగవచ్చుననియు ఇన్స్పెక్టరుకు తెలియబరుస్తాడు. అగ్గిరాముడిని శారద ప్రేమిస్తుంది. చివరకు అసలు అగ్గిరాముడు (దొరస్వామి) చనిపోతూ, తన నిజగాథ వివరిస్తాడు. అప్పుడు అగ్గిరాముడు నిజం తెలిసికొని, తనకు శారద మరదలనియు, తన తల్లి శారదగారింట్లో నే యున్నదనియు, తెలిసికొని, తన పినతల్లిని కూడ వెంటబెట్టుకొని, శారదవాళ్లింటికి వచ్చి, ఈ సంగతి వారందరికి తెలియపర్చగా, వారందరు సంతోషించి, శారదను అగ్గిరాముడుకు ఇచ్చి వివాహము చేస్తారు. ఈ లోపునసే, వీరరాజు, అతని అనుచరులు జైల్లో పడతారు. చివరకు తానే





స్వాతంత్ర్యోత్సవాలలో పాల్గొనడంలో సినిమా తార లెవరికీ తీసిపోరు
మద్రాసు, లక్ష్మీపురం యంగ్ మెన్స్ ఎసోసియేషన్‌లో
జాతీయపతాకం ఆవిష్కరిస్తున్న తార పద్మిని.

# ★ ప్రేక్షకుల అభిప్రాయాలు ★

కఠినంగా వ్యవహరిస్తున్నాడని గూడ అగ్గిరాముడు తెలియబరుస్తాడు.

డైరెక్షను కొన్నిచోట్ల తప్ప, బాగానే యున్నది. ఫోటోగ్రఫీ, లైటింగు బాగానే యున్నవి. పాటలూ, డాన్సులు చక్కగ యున్నవి. రామారావు అగ్గిరాముడుగాను, కఠినంగాను చక్కగా పాత్రపోషణ చేసినారు. భానుమతి, కలంగి, ముక్కాముల నటనలలో క్రొత్తదనము లేదు. నాజర పార్టీవారి బుర్రకథ (అల్లూరి సీతారామరాజు జీవిత చరిత్ర) దీనికొక ప్రత్యేకాకర్షణ. ఇది ఒక జాతికి సంబంధించిన చిత్రంగా కనుపించటములేదు. ఇందులో ప్రేమ, స్టంటు, కామిక్ అన్నీ యున్నవి.

డిటెక్టివ్ కథగా తయారైంది.

కలంగికి 9 మంది సంతానమనియు, ఇద్దరు భార్యలనియు, తల్లి, దండ్రి అనియు ప్రతిసారి చెప్పించినారు, కాని వారి నొక్కసారయినా చూపించలేదు. చూపించాల్సిన అవసరం లేదని, మాటల్లో చెప్పిస్తే సరిపోతుందని డైరెక్టరుగారి తలంపు గాబోలు. మొట్టమొదట శారదను రక్షించేటప్పుడు తప్ప, మిగిలిన సమయాల్లో అగ్గిరాముడు అనుచరులు లేకుండా, తానొక్కడే 10 మందికి సమానమయినట్లు ప్రతిచోటా ఒంటరిగా పోట్లాటలకు హాజరవుతాడు, పోట్లాడుతాడు; వింగతో వారిని రెండు దెబ్బలలో స్పృహ లేకుండా చేస్తాడు కాని అతనికి దెబ్బ తగలదు సరిగదా, సరిగ్గా జుట్టైనా రేగదు, చెమటయినా పోయదు. అటువంటప్పుడు అతని దగ్గర 50 మంది వరకు వస్తాదులు కత్తియుద్ధాలు, కర్రయుద్ధాలు, బాక్సింగు నేర్చుకుంటున్నట్టుగా చూపిస్తారు; కాని వారు అగ్గిరామునితో ఒక్కసారైనా సహాయం వచ్చినట్లు కన్పడదు. అటువంటప్పుడు వారికి పూరక తిండి పెట్టి, జీతమిచ్చి వుంచుకోనుట ఎందుకో?

ఇటువంటి చిన్న చిన్న లోపాలు కొన్ని యున్నప్పటికీ, మొత్తంమీద చిత్రం చూస్తూంటే చాలా వినోదకరంగాను, అద్భుతంగాను వున్నది. ఈ చిత్రం ఎట్లాగయినప్పటికీ, విశాలాంధ్రలో విజయం పొందగలదు.

పి. ఎల్. నారాయణ
—ఏలూరు.

* * *

పక్షిరాజావారి "అగ్గిరాముడు" ఎంతో శ్రమతో తీసిన చిత్రము. వీరి మొన్న మొన్నటి చిత్రము "ఒక తల్లి పిల్లలు" కొన్ని విజయవంతం అయిందేమో. ఈ చిత్రం శ్రీ నాయుడుగారి పేరు వృద్ధి చేసేదిగా లేదు.

ఈ చిత్రంలో కొత్త పోకడ లేమియు లేవు. కొండసీనులు చాలా సేపు చూపించటము, కొండపై కర్రలయుద్ధము చేయటం విసుగు పుట్టిస్తాయి. నాజర్ బుర్రకథ గూడ బాగుగా లేదు. పాటలు మంచివి లేవు. భానుమతి చివరి పాట కొద్దిగా బాగుంది. లైటింగ్ సరిగాలేదు. కొంచెము విమర్శనా దృష్టితో చూస్తే కథలో అన్నీ లోపాలే. ఇంటర్వల్ తరువాత డిటెక్టివు కథ ధోరణిలో కొంత బాగుంది. కలంగి, శ్రీరాం బాగా నటించారు. భానుమతి, రామారావుల నటన అంత బాగుగా లేదు. బాలసరస్వతి ఈ చిత్రంలో ఎందుకో. ముక్కా

ముల తన పాత్రను బాగుగనే పోషించాడు.

రేలంగి హాస్యమే సినిమాలో కొద్దిగా బాగున్నది. ఆర్. నాగేశ్వరరావు, మహంకాళి ఒకమాదిరనిపించారు. మొత్తం మీద ఇది ప్రజాదరణ పొందలేదు.

ఎస్. వెంకటేశ్వరరావు
—బందరు.

* * *

అగ్గిరాముడు యెక్కడా యే బందిపోటు దొంగతనం గానీ, దారిదోపిడీ గానీ చేసినట్లగుపించదు. ఇక అగ్గిరామునికి ఆపేరు రావడానికి అవకాశమెక్కడ? యే దొంగతనం చేయకపోతే అంత ధనవంతుడెలా కాగలడు? తన ముఠా నంతటిని ఎలా పోషించగలడు? కాబట్టి యేదో దొంగతనాలు, దారిదోపిడీలు చేసివుండాలి. కానీ చిత్రంలో అగ్గిరాము ఆవిధమైన దొంగతనం చేసినట్లు అగుపించలేదు. అలాంటి అగ్గిరాముడు ఇక గుహాలలో దాగి, మారువేషాలతో అజ్ఞాతవాసం చేస్తున్నట్లు చూపారు. అటున్నప్పటికి అతని గుహాలు అంత శోభాయమానంగా, బంగళాల్లాగా తయారుచేయబడి వున్నాయంటే మరీ ఆశ్చర్యం వేస్తుంది. వీటికంతటికి ధనమవసరమే! యే దోపిడీ చేయకపోతే ఇంతధనం యెక్కడిది? ఆ గుహాలుగూడా అసహజంగా వున్నాయి. రహస్యమార్గంగుండా గుహ ప్రవేశిస్తారు. మరో రెండు సీనులలో చుట్టూ కిటికీలున్న బంగళాలో అగుపిస్తారు. గుహాలలో నిర్మించే గృహాలకు కిటికీ లుండడం సహజమేనా?

అగ్గిరామునికి ప్రత్యేకంగా కొండలను అటునుండి యిటుదాటే తీగ యంత్రం వున్నట్లు చూపారు. ప్రభుత్వాలకళ్లలో ప్రపంచమంతా మెలుగుతున్నవుడు అంత బహిరంగంగా యిటువంటి యంత్రం రెండు కొండల నడుమ వున్నదంటే ప్రభుత్వం విచారించకుండా వుంటుందా?

వస్త్రధారణ అక్కడక్కడ జానపద ఫక్కీలో నడచింది. చిత్రం యేకాలందో అనే అనుమానం లేకుండా, ప్రేక్షకులకు అప్పుడప్పుడు రాజా, రాణీల చిత్రాలగుపడుతూ వుంటాయి. చిత్రం తెలుగుదై ఆంధ్ర దేశంలో గల పట్టణాలను సంబంధించిన కథ గలదై అగ్గిరాముని గుహాలో అతని వారు తమిళగ్రంథాలు చదువుతున్నారంటే మరీ వింతగా వుంది. ఇలాంటి చర్చించదగిన లోపాలు చిత్రంలో యింకా వున్నాయి.

చిత్రంలో టెంపో లేకపోవడంవలన చిత్రం నీరసంగా వుంది. కానీ అప్పుడప్పుడు కత్తిసాము, మల్లయుద్ధాలు ప్రేక్షకులకు చూపడంవలన, విసుగుచెందుతున్న ప్రేక్షకులు చిత్రాన్ని చూడడానికి కొద్ది వుత్సాహవంతులౌతారు. నిజంగా అగ్గిరాముని అనుచరులు చేసిన కత్తిసాము, మల్లయుద్ధం, నాట్యాలు యెంతో బాగున్నాయి.

ఆత్రేయగారి మాటలు, పాటలు యింపుగా వున్నాయి. సుబ్బయ్యనాయుడుగారు తన సంగీతదర్శకత్వంలో ప్రేక్షకుల మన్ననలందుకోలేకపోయారు. అక్కడక్కడ హిందీట్యూనులు జొప్పించబడ్డాయి. బోస్‌గారి ఛాయాగ్రహణంలో 'నైట్ యెఫెక్ట్స్' సహజంగా వున్నాయి. ఇంకా అనవసర సన్నివేశాలతో నిండివుండడంవలన చిత్రం నిడివి హెచ్చింది.

అగ్గిరాముడుగా, ముసల్మానుగా నటించిన రామారావు నటన తృప్తికరంగానే వుంది. శారదగా నటించిన భానుమతి నటన నిర్జీవంగా వుండటంలో ఆశ్చర్యం లేదు. చిత్రంలో బాలసరస్వతి పాత్రను అనవసరంగా కల్పించారు. ఆ పాత్ర లేకపోయినా ఫరవాలేదు. 441 గా రేలంగి హాస్యధోరణి విచిత్రంగా వుంది. కానీ ముక్కామల పూర్వ నటన యేమయిందో? వీర్రాజుగా శ్రీరామ్ బాగా నటించలేకపోయాడు. వస్తాదు కాళయ్యగా నాగేశ్వరరావు బాగా రాణించాడు.

కానీ చిత్రం మొత్తానికి ప్రేక్షకులను ఆకర్షించగలదు. టెంపో లేకపోవడంవలన చిత్రం నీరసంగా వున్నప్పటికి అప్పుడప్పుడు రేలంగి హాస్యధోరణికి ప్రేక్షకులు ఆనందిస్తారు.

సి. వి. నారాయణరావు
—నెల్లూరు.

* * *

చిత్రంలో కథకు సంబంధంలేని ఘటనలు అక్కడక్కడ చిత్రించబడ్డాయి. ఉదాహరణకు భార్య కొట్టిందని ఎవరో పోలీస్ కానిస్టేబుల్ వద్దకు వెళ్ళి ఫిర్యాదు చేయుటంవంటివి. ఇటువంటివి కేవలం వినోదంకోసం, చిత్రాన్ని పొడిగించడం కోసం చిత్రించినట్లుగా కనబడుతున్నవి. పోలీస్‌స్టేషన్ ముఖ్యంలో పోలీస్ ఉండగా హెడ్ కానిస్టేబుల్ సాధువేషంలో స్టేషన్ ప్రవేశించి యిన్‌స్పెక్టర్ దగ్గరకు వెడతాడు. పోలీస్ అక్కడ ఉండగా సాధుని స్టేషన్‌లోపలికి ఎలా పోనిస్తాడు? పోనీ యీ ఘటన కథాగమనానికి ఏమైనా తోడ్పడిందా అంటే, అదీ లేదు. హెడ్ కానిస్టేబుల్ యినస్పెక్టర్ దగ్గర యిష్టంవచ్చినట్లు మాట్లాడతాడు. ఎంత వెకిలివాడైనా హెడ్ కానిస్టేబుల్ యిన్‌స్పెక్టరు దగ్గర అలా మాట్లాడడం అసంభవం. హాస్యంకోసం చిత్రించబడిన యీ పాత్ర చాలా అసహజంగా తయారయింది.

కథ [illegible]

ముష్టీలు, కత్తిసాములు విసుగెత్తించాయి.

రచన తృప్తికరంగాలేదు. దర్శకత్వంలో కూడ క్రొత్తదనం కనిపించలేదు. టెక్నికల్‌గా చిత్రం సామాన్యంగా ఉంది. భానుమతి సహజంగా నటించింది. కాని అక్కడక్కడ నటన 'ఓవర్'గా ఉంది. ఎన్. టి. బాగానే నటించాడు. తెలుగు వర్షన్‌లో పూర్తిగా తెలుగు నటులే ఉండాలని గమనించడం అవసరం.

సాయి - సుబ్బులక్ష్ముల నాట్యాలు బాగున్నాయి. ఈ చిత్రం ఆర్థికంగా విజయం సాధించవచ్చు.

నూకల రామానుజరావు
—[illegible]నాగరం.

# ఇటాలియన్ చిత్రాలు

(52-వ పేజీ తరువాయి)

ఒలీవియర్ హామ్లెట్‌గా నటించాడు, ఒలీవియర్ గొప్పనటుడే. స్వగతాలు అతడు పలికిన పద్ధతి చాలా గొప్పగా ఉంది. కాని ఆ చిత్రం నాకు ఎందుకో కృత్రిమంగా కనిపించింది. కెమెరాలెన్సు ద్వారా ప్రపంచాన్ని మనం చూచేటప్పుడు వాస్తవిక వాతావరణం ఏర్పడుతుంది. ఈ వాతావరణంలోకి హామ్లెట్ స్వగతాలు ఇమడవు. నిజమైన సముద్రపు దృశ్యాల పక్కన హామ్లెట్ తండ్రి ప్రేతం అసందర్భంగా కనిపిస్తుంది. సినిమా పోవలసిన దారివేరు, నాటకం పోవలసిన దారి వేరు. దాని పద్ధతులూ, దీని పద్ధతులూ ఎక్కడా కలవవు. ఒక నాటకప్రదర్శనాన్ని సినిమా తీయవచ్చు. కాని అది ఫొటోగ్రాఫ్ మాత్రమే అవుతుంది; ఒక క్రొత్త కళాసృష్టి కానేరదు.

ఇటాలియన్ సినిమా కళప్రతినిధులు తెరకు అనువైన క్రొత్త సూత్రాలను, క్రొత్త చిత్రణ విధానాన్ని అన్వేషిస్తున్నారు. ఇదే వారి ప్రత్యేకత. ఇందుకు వారిని నేను అభినందిస్తున్నాను. వారి చిత్రాల ద్వారా ఇటాలియన్ ప్రజల కష్టసుఖాల్లో నేను ఐక్యం కాగలిగాను. ఈ కారణంచేత కూడా ఇటాలియన్ దర్శకులకు నేను కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

('సోవియెట్ లిటరేచర్' నుండి) ★

## "రామాంజనేయ సంగ్రామం"

కాశీనాథ ప్రొడక్షన్స్ అనే పేరుతో స్థాపించబడిన ఒక క్రొత్త సంస్థవారు "రామాంజనేయ సంగ్రామం" అనే పౌరాణిక చిత్రం తీస్తున్నట్లు తెలుస్తోంది. సెప్టెంబరులో [illegible]



"రేచుక్క" లో అంజలిదేవి.



కృషి

ఫొటో : బి. రంగనాథన్. (మద్రాసు)